# రుద్రసూక్తము



కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

# రుద్రసూక్తము

[టీకా, తాత్పర్య, రహస్య వివరణములతో]

వ్యాఖ్యానము :

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య



ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురణ
విశాఖపట్టణము – 530 016.

ప్రథమ ముద్రణ : 1979
తృతీయ ముద్రణ : 1997

ప్రతులు : 2000

వెల : రూ. **20-00**

ప్రాప్తిస్థానము :
ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
45-40-36/1, అక్కయ్యపాలెం,
విశాఖపట్నం - 530 016.
ఫోను : 565291.

ముద్రణ :

ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్
విశాఖపట్నం - 16, ఫోన్ : 547320.

# మనవి

“నేను భూమికి దిగివచ్చిన ముఖ్యమైన కారణము రచనా కార్యక్రమము. ఇది తరతరములకు, రాబోవు యుగములకు కూడ సంబంధించినది. కనుక నా జీవిత కాలములో కనీసము ఒక్కరోజు కూడ వృధా చేయుటకు వీలుపడనిది.” అని 15-9-1976వ తేదీన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య (మాస్టర్ ఇ. కె.) గారు విదేశ యాత్ర నుండి మాకు పంపిన డైరీలో వ్రాసిరి.

ఆ మహాత్ముని రచనా ప్రణాళికలో భాగముగా సుమారు 100కు పైగా తెనుగు, ఆంగ్ల గ్రంథములను రచించిరి. వాటిని ది వరల్డ్ టీచర్ ట్రస్ట్ ప్రచురించినది. వేద జీవనమే మానవాళికి శరణ్యమని విశ్వసించిన మాస్టర్ ఇ. కె. గారు వేద మార్గమును సులభముగా వివరించుటకుగాను వేద గ్రంథములలో గల కొన్ని సూక్తములకు చక్కని వ్యాఖ్యానములను అందించిరి. వేద మంత్రములకు అర్థము, అంతరార్థము, పరమార్థములను విజ్ఞానాత్మకముగా ఇచ్చుటలో భాగముగా మాస్టర్ ఇ. కె. గారు పురుష సూక్తము, శ్రీ సూక్తము, విష్ణు, రుద్ర, సుపర్ణ సూక్తములకు వ్యాఖ్యానములను రచించిరి.

తృతీయ ముద్రణమైన ఈ “రుద్ర సూక్తము”ను సాధక భక్తులకు సమర్పించుచున్నాము. ఈ గ్రంథమును ముద్రించిన ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్ వారికి మా కృతజ్ఞతలు.

22-10-1997

విశాఖపట్నం

—చింతలపాటి సత్యదేవ్

ది వరల్డ్ టీచర్ ట్రస్ట్

## • కులపతి బుక్ ట్రస్ట్ •



* యుగముల తరబడి మానవునకు ప్రసాదింపబడిన శాశ్వత జ్ఞానమును వెదజల్లుటకై స్థాపించబడినదీ గ్రంథ ప్రచురణ సంస్థ. ఈ గ్రంథము వలన కలుగు ఆదాయము ఇట్టి గ్రంథముల పునః ప్రచురణచేసి సత్యమును వెదజల్లుటకై మాత్రమే వినియోగింపబడును.

# పరిచయము

నమకమను పేరుతో జగత్ప్రసిద్ధమైన ఈ రుద్ర సూక్తము యజుర్వేదము నందలి ప్రధాన మంత్రభాగము లోనిది. ఋగ్వేదమునందును, అథర్వణ వేదమునందును గూడ నిందలి మంత్రభాగము లున్నవి. శ్రీ సూక్త, పురుష సూక్తములతో సమానమైన బహుళప్రచారము దీనికి గలదు. దీని ప్రభావము గూడ అమోఘము. ఆపదలు, రోగములు, దారిద్ర్యాది పీడలు, అకాలమరణములు వెన్నాడుచున్న వారు దీనిని భక్తితో అనుష్ఠానము చేసి రుద్రు నుపాసించి తమ పూర్వ జన్మ కర్మ ఫలములను రహిత మొనరించుకొని సుఖములను పొందుచున్నారు. వారికి ఇహపర సౌఖ్యములకు మనస్సు నందు బాట యేర్పడుచున్నది. కనుకనే ఈ వేద మంత్ర మును బహు సంప్రదాయములలో బహు విధములుగా నుపా సించు భక్త జనులున్నారు. రుద్రాభిషేకము, మహాన్యాసము, రుద్రయాగము, లింగ ప్రతిష్ఠ, నిత్యార్చనము, ఈ మహా మంత్రము యొక్క వినియోగముతో నిండియున్నవి.

వేదసంహితల వ్యాఖ్యానములందు దీనికిని వ్యాఖ్యానము లున్నవి. అందు మహామహులైన వ్యాఖ్యాతలకు గూడ దురవగాహములైన విషయములు దీనియందున్నవి. అట్టి సందర్భమున నవీనులైన పాశ్చాత్య వ్యాఖ్యాతలు గూడ దీనికి వివరణము, అనువాదము చేసి యున్నారు. కీత్, గ్రిఫిత్ మున్నగువారు వేదసంహితలతో పాటు రుద్ర సూక్తమును గూడ ఆంగ్లమున కనువదించియున్నారు. కాని ఆ యనువాదములు పదముల కనువాదములే తప్ప భావమును వివరింప గలిగినవి కావు. వానిని చదువుకొనినపుడు మూలము తెలియని నవీనులకు కొందరికి వేదముపై చులకన అభిప్రాయములు కలుగుటకు వీలున్నది. దానిని చూచి నిజమైన భక్తులు బాధపడుట కూడ గలదు. వారందరికిని సంతోషము కలిగించునట్టి టీకా తాత్పర్య వివరణములు రచించుట యనగా వారిలోనున్న రుద్రుని ఆరాధించుటయే! అందులకే ఈ పుస్తకము ప్రచురింపబడినది.

భక్తులు తనను భగవంతునకు సమర్పణ చేసికొను సాధనలో తాము భగవంతుని మూర్తులగుచున్నారు. వీరందరును సృష్టికర్మయందలి యజ్ఞమునందు ఋత్విక్కులుగా తమ తమ పనుల నాచరించు రుద్రమూర్తులుగనే జీవితము గడుపుదురు. దానిని తెలుపునట్టి మంత్రప్రార్థనమే "రుద్రసూక్తము".

ప్రకృతిలో పుష్పములు విచ్చుకొను ఆకారములును, సీతాకోక చిలుకల రెక్కలపై ప్రకృతి పెట్టిన ముగ్గులను గమనించినచో ప్రకృతిలోని శక్తులయందు యెంత సౌందర్య భావమున్నదో తెలియును. ఆ శక్తులే దేవతలుగా మానవుని మనస్సున గూడ పనిచేసి దైవ సౌందర్యమును మంత్రముల రూపమున నేర్పి ఆరాధన సంప్రదాయములను క్రమశిక్షణము జేసిరి. వానిని స్వీకరించిన మానవుడు వేద గ్రంథములను అందిపుచ్చుకొనెను. సృష్టిలో మొదటి వాక్కులే సారవంత ములై ఈ వేద మంత్రములుగా దర్శనమిచ్చినవి. అందు ప్రత్యక్షములైన దేవుని రూపములే దేవతలు. వేద దేవత లలో విష్ణువు, రుద్రుడు ప్రథమగణ్యులు. వారే ఉపనిషత్తుల లోను, పురాణములలోను, ఇతిహాసములలోను ముఖ్యస్థాన మాక్రమించిరి. వారి ప్రభావమే వైష్ణవము, శైవము అను సంప్రదాయములుగా ప్రజలలోనికి దిగివచ్చినది. ఇది తెలి యక శైవులు, వైష్ణవులు వేరువేరు మతములవారనుకొను చున్నారు. పాశ్చాత్యులలోనే గాక భారతీయులలో గూడ పూర్వాచార పరాయణులైన శైవులు, వైష్ణవులు ఇట్టి భ్రమకులోనై వాదించుకొనుచున్నారు. వారిని చూచి శివుడు, విష్ణువు నవ్వుకొనుచుండ వచ్చును. ఇట్టి దుర్భ్రమలను పోగొట్టుకొనుటకు వేదమందలి రుద్రుని, విష్ణువును పరిచ యము చేయుటొక్కటే మార్గము. ఈ సూక్తములలోని భావమును సులభశైలిలో వివరించుట దాని కుపకరించును.

ఈ సూక్తమునందు సృష్టిలోని నరులును, పశుపక్ష్యాదులును, ప్రకృతి శక్తులును, రుద్రమూర్తులుగా భావన చేయు సాధన విధానమున్నది. మానవులలో గూడ వివిధ జాతులు, వివిధ వృత్తులవారు రుద్రమూర్తులే! యుద్ధము చేయువారు, శాంతిని ప్రసాదించువారు, దొంగలు, మోసకాండ్రు, దొరలు, సజ్జనులు, కుక్కలు, కుక్కలను పెంచువారు, అందరును రుద్ర పరబ్రహ్మము యొక్క సగుణ మూర్తులే! ఇంతకన్న విశాలతరమైన దైవభావన ఏమి యుండును? ఇంతకన్న సంసారతరణ సాధన మేముండును? ఇట్టి జగత్కల్యాణమైన వేదమంత్ర వివరణము చదువరుల రూపమున నున్న రుద్రునకు సంతోషము కలిగించును గాక! భక్తులకు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించును గాక!

విశాఖపట్టణము
5-12-1979

ఇట్లు
ఎక్కిరాల కృష్ణమాచార్య



# శాంతి పాఠము

శన్నో మిత్ర శ్శం వరుణః। శన్నో భవ త్వర్యమా।

శన్న ఇన్ద్రో బృహ స్పతిః। శన్నో విష్ణు రురుక్రమః।

నమో బ్రహ్మణే। నమస్తే వాయో।

త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మసి।

త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి।

ఋతం వదిష్యామి। సత్యం వదిష్యామి।

తన్మామవతు। తద్వక్తార మవతు।

అవతు మామ్। అవతు వక్తారమ్।

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

అర్థము : మిత్రుడు, వరుణుడు, అర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విష్ణువు మాకు సుఖశాంతులను కలిగింతురు గాక! బ్రహ్మమునకు నమస్కారము. ఓ వాయుదేవా! నీకు నమస్కారము. నీవే ప్రత్యక్ష బ్రహ్మము. నిన్నే వాగ్బ్రహ్మము రూపముగా పలుకుచున్నాను. ఋతముగ, సత్యముగ నిన్నే పలుకుచున్నాను. కనుక నీవు నన్ను, నన్ను పలికించు వానిని (గురుశిష్యులను) రక్షింపుము.

# రుద్ర సూక్తము

## (నమకము)

### పూర్వ పీఠికా

ఓం నమో భగవతే రుద్రాయ । నమస్తే రుద్ర మన్యవ ఉతోత
ఇషవే నమః । నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః ।
యా త ఇషుశ్శివతమా శివం బభూవ తే ధనుః । శివా శరవ్యా యా
తవ తయా నో రుద్ర మృడయ । యా తే రుద్ర శివా తనూ ర
ఘోరాఽపాపకాశినీ । తయా న స్తనువా శంతమయా గిరిశన్తాభి
చాకశీహి । యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే ॥ ౧.

శివాం గిరిత్ర తాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్ ।
శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి । యథా నస్సర్వ
మిజ్జగదయక్ష్మగ్ం సుమనా అసత్ । అధ్యవోచదధివక్తా ప్రథమో

దైవ్యోభిషక్ । అహీగ్ంశ్చ సర్వాఞ్జమ్భయ న్థ్సర్వాశ్చయాతు
ధాన్యః । అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సు మఙ్గలః ।
యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు ॥ ౨.

శ్రితా స్సహస్రశోఽవై షాగ్ం హేడఈమహే । అసౌ
యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః । ఉతైనం గోపా
అదృశన్న దృశన్ను దహార్యః । ఉతైనం విశ్వా భూతానిస
దృష్టో మృడయాతి నః । నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ
మీఢుషే । అథోయే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః ।
ప్రముఞ్చ ధన్వన స్త్వముభయోరార్త్ని యోర్జ్యామ్ । యాశ్చ తే
హస్త ఇషవః ॥ పరా తాభగవోవప ॥ ౩.

అవతత్య ధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే ।
నిశీర్య శల్యానాం ముఖాశివో నస్సుమనా భవ । విజ్యం ధనుః

కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత। అనేశన్న స్యేషవ ఆభురస్య
నిషఙ్గథిః। యాతేహేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః।
తయాఽస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మ యాపరిబ్భుజ। నమస్తే
అస్త్వాయుధాయాఽనా తతాయ ధృష్ణవే। ఉభాభ్యాముత
తేనమో బాహుభ్యాం తవధన్వనే। పరి తే ధన్వనో హేతి
రస్మాన్వృణక్తు విశ్వతః। అథోయ ఇషుధి స్తవాఽఽరే అస్మన్ని
ధేహితమ్॥ ౪.

నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ మహాదేవాయ
త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్ని
రుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ
సదాశివాయ శ్రీమన్మహాదేవాయనమః॥

## నమకము

నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమో
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమో
నమస్స్పిఞ్జరాయ త్విషీమతే పథీనాం పతయే నమో నమో
బభ్లుశాయ వివ్యాధినేఽన్నా నాం పతయే నమో నమో
హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమో నమో భవస్య
హేత్యై జగతాం పతయే నమో నమో రుద్రాయాఽఽతతావినే
క్షేత్రాణాం పతయే నమో నమస్సూతాయాఽహన్త్యాయ వనానాం
పతయే నమో నమః ॥ ౨.

రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమో నమో
మన్త్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమో నమో భువన్తయే
వారివస్కృతా యౌషధీనాం పతయే నమో నమ ఉచ్చైర్ఘోషాయా

ఽఽక్రన్దయతే పత్తీనాం పతయేనమో నమః కృత్స్నవీతాయ
ధావతే సత్వనాం పతయే నమః ॥ ౬.

నమస్సహమానాయనివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే
నమో నమః కకుభాయ నిషఙ్గిణేస్తేనానాం పతయే నమో నమో
నిషఙ్గిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమో నమో వఞ్చతే
పరివఞ్చతే స్తాయూనాం పతయే నమో నమో నిచేరవే
పరిచరాయారణ్యానాం పతయే నమో నమస్సృకావిభ్యోజిఘాగ్ంం
సద్భ్యోముష్ణతాం పతయే నమో నమోఽసిమద్భ్యో నక్తం
చరద్భ్యం ప్రకృన్తానాం పతయే నమో నమ ఉష్ణీషిణే
గిరిచరాయకులుఞ్చానాం పతయే నమో నమః ॥ ౩.

ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ వో నమో నమ ఆతన్వానేభ్యః
ప్రతిదధా నేభ్యశ్చవో నమో నమ ఆయచ్ఛద్భ్యో

విసృజద్భ్యశ్చ వో నమో నమోఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చ వో నమో
నమ ఆసీనేభ్యశ్శయా నేభ్యశ్చవో నమో నమస్స్వపద్భ్యో
జాగ్రద్భ్యశ్చవో నమో నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమో
నమస్సభాభ్య స్సభాపతిభ్యశ్చవో నమో నమో అశ్వేభ్యో
ఽశ్వపతిభ్యశ్చవో నమః ॥ ౩.

నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీ భ్యశ్చవో నమో నమ
ఉగణాభ్య స్తృగం హతీభ్యశ్చవో నమో నమోగృత్సేభ్యో
గృత్సపతిభ్యశ్చవో నమో నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ
వో నమో నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో నమో
విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమో నమో మహద్భ్యః ॥
క్షుల్లకేభ్యశ్చ వో నమో నమో రథిభ్యోఽరథేభ్యశ్చ వో నమో
నమో రథేభ్యః ॥ ౪.

రథపతిభ్యశ్చ వో నమో నమస్సేనాభ్య స్సేనానిభ్యశ్చ
వో నమో నమః క్షత్తృభ్య స్సంగ్రహీతృభ్యశ్చ వో నమో
నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమో నమః కులాలేభ్యః
కర్మారేభ్యశ్చ వో నమో నమః పుఞ్జిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో
నమో నమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చ వో నమో నమో
మృగయుభ్యశ్శ్వనిభ్యశ్చ వో నమో నమశ్శ్వభ్యశ్శ్వపతి
భ్యశ్చవో నమః ॥ ౧౦.

నమో భవాయ చ రుద్రాయ చ నమశ్శర్వాయ చ
పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ నమః కపర్దినే
చ వ్యుప్తకేశాయ చ నమస్సహస్రాక్షాయ చ శతధన్వనే చ
నమో గిరిశాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ
చేషుమతే చ నమో హ్రస్వాయ చ వామనాయ చ నమో

బృహతే చ వర్షీయసే చ నమో వృద్ధాయ చ సంవృద్ధ్వనే
చ ॥ ౧౧.

నమో అగ్రియాయ చ ప్రథమాయ చ నమ ఆశవే చాజి
రాయ చ నమశ్శీఘ్రియాయ చ శీభ్యాయ చ నమ ఊర్మ్యాయ
చావస్వన్యాయ చ నమ స్స్రోతస్యాయ చ ద్వీప్యాయ చ॥ ౧౨.

నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వజాయచా
పరజాయ చ నమో మధ్యమాయ చాపగల్భాయ చ నమో
జఘన్యాయ చ బుధ్నియాయ చ నమస్సోభ్యాయ చ ప్రతి
సర్యాయ చ నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ నమ ఉర్వ
ర్యాయ చ ఖల్యాయ చ నమశ్లోక్యాయ చావసాన్యాయ చ
నమో వన్యాయ చ కక్ష్యాయ చ నమశ్శ్రవాయ చ ప్రతిశ్ర
వాయ చ॥ ౧౩.

నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమశ్శూరాయచావ

భిన్దతే చ నమో వర్మిణే చ వరూథినే చ నమో బిల్మినే చ కవచినే చ నమశ్శ్రుతాయ చ శ్రుతసేనాయ చ ॥ ౧౪.

నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో దూతాయ చ ప్రహితాయ చ నమో నిషఙ్గిణే చేషుధిమతే చ నమస్తీక్ష్ణేష వేచాయుధినే చ నమ స్స్వాయుధాయ చ సుధన్వనే చ నమస్స్రుత్యాయ చ పథ్యాయ చ నమః కాట్యాయ చ నీప్యాయ చ నమ స్సూద్యాయ చ సరస్యాయ చ నమో నాద్యాయ చ వైశన్తాయ చ ॥ ౧౫.

నమః కూప్యాయ చావట్యాయ చ నమో వర్ష్యాయ చావర్ష్యాయ చ నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ నమ ఈధ్రియాయ చాతప్యాయ చ నమో వాత్యాయ చ రేష్మియాయ చ నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయచ॥ ౧౬.

నమస్సోమాయ చ రుద్రాయ చ నమస్తామ్రాయ చారు
ణాయ చ నమశ్శఙ్గాయ చ పశుపతయే చ నమ ఉగ్రాయ చ
భీమాయ చ నమో అగ్రేవధాయ చ దూరేవధాయ చ నమో
హన్త్రే చ హనీయసే చ నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తా
రాయ నమశ్శమ్భవే చ మయోభవే చ నమ శ్శఙ్కరాయ
చ మయస్కరాయ చ నమశ్శివాయ చ శివతరాయ చ ॥ ౧౭.

నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ నమః పార్యాయ చావా
ర్యాయ చ నమః ప్రతరణాయ చోత్తరణాయ చ నమ ఆతార్యా
యచా లాద్యాయ చ నమ శ్శష్ప్యాయచ ఫేన్యాయ చ
నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ॥ ౧౮.

నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ నమః కిగ్ంశిలాయ చ క్షయణాయ చ నమః కపర్దినేచ పులస్తయే చ నమో

గోష్ఠ్యాయ చ గృహ్యాయ చ నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయచ నమో హ్రదయ్యాయ చ నివేష్ప్యాయ చ నమః పాగ్ం సవ్యాయ చ రజస్యాయ చ నమశ్శుష్క్యాయ చ హరిత్యాయ చ నమో లోప్యాయ చోల పాయ చ ॥ ౹౯.

నమ ఊర్వ్యాయ చ సూర్మ్యాయ చ నమః పర్ణ్యాయ చ పర్ణన్ శద్యాయ చ నమోఽపగురమాణాయచాఽభిఘ్నతే చ నమ ఆఖ్ఖిద తేచ ప్రఖ్ఖిద తేచ నమోవః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యో నమో విక్షీణ కేభ్యోనమో విచిన్వత్కేభ్యోనమ అనిర్హ తేభ్యోనమ ఆమీవత్కేభ్యః ॥ ౨౦.

## ఫలశ్రుతి

ద్రాపె అన్ధసస్పతేదరిద్ర న్నీలలోహిత । ఏషాం పురు

షాడా మేషాం వతూనాం మాభేర్మా౽రోమో ఏషాంకించ నామమత్ । యాతే రుద్రశివా తనూ శ్శివావిశ్వాహ భేషజీ । శివా రుద్రస్య భేషజీ । తయానో మృడజీవసే । ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినేక్షయద్వీరాయ ప్రభ రామ హేమతిమ్ । యథా నశ్శమసద్ద్విపదే చతుష్పదే విశ్వంపుష్టం గ్రామే అస్మిన్ । అనాతురమ్ ॥ ౧౧.

మృడానో రుద్రోతనో మయస్కృధిక్షయద్వీరాయ నమసా విధేమతే । యచ్ఛంచయోశ్చమను రాయజేపితా తదశ్యామ తవరుద్రప్రణీతౌ ॥ ౧౨.

మానో మహాన్త ముత మానో అర్భకం మాన ఉక్షన్తముత మాన ఉక్షితమ్ । మానోవధీః పితరం మోత మాతరం ప్రియా మానస్తనువః ॥ రుద్రరీరిషః ॥ ౧౩.

మానస్తోకేతనయె మాన అయుషిమానో గోషు మానో అశ్వేషు రీరిషః । వీరా న్మానో రుద్ర భామితోవధీర్ హవిష్మన్తో నమసా విధేమతే । ఆరాత్తేగోఘ్న ఉతపూరుషఘ్నే క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు । రక్షాచనో అధిచ దేవబ్రూహ్యధాచనశ్శర్మ యచ్ఛ ద్విబర్హాః । స్తుహిశ్రుతంగర్తసదంయువానం మృగన్నభీమ ముపహత్ను ముగ్రమ్ । మృడా జరిత్రేరుద్రస్తవానో అన్యంతే అస్మన్నివపన్తు సేనాః పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు పరిత్వేషస్య దుర్మతిరఘాయోః । అవస్థిరామఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ । మీఢుష్టమశివతమ శివోనస్సుమనాభవ । పరమేవృక్ష ఆయుధం నిధాయకృత్తిం వసాన ఆచర పినాకం । బిభ్రదాగహి ॥ ౨౪.

వికిరిద విలోహితనమస్తే అస్తుభగవః । యాస్తేసహస్రగ్ం

హేతయోఽవ్యమస్మన్నివపస్తుతాః । సహస్రాణి సహస్రధా బాహువోస్తవహేతయః । తాసామీశానో భగవః పరాచీనా ముఖా కృధి ॥ ౨౭.

సహస్రాణి సహస్రశో యేరుద్రా అధిభూమ్యామ్ ॥ తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వానితన్మసి । అస్మిన్మహత్యర్ణవేఽన్తరిక్షేభవా అధి ॥ ౨౮.

నీలగ్రీవా శ్శితికంఠాశ్శర్వా అధః క్షమాచరాః । నీలగ్రీవాశ్శితి కంఠాదివగ్ం రుద్రాఉపశ్రితాః । యేవృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః యేభూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః । యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్ । యేపథాం పథిరక్షయ ఐలబృదాయ వ్యుధః । యేతీర్థాని ప్రచరన్తి సృకావన్తో నిషఙ్గిణః । యఏతావన్తశ్చ భూయాగ్ం

సహస్రాణి సహస్రశో యే రుద్రా అధి భూమ్యామ్ ... సశ్చ దిశో రుద్రావితస్థిరే । తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి । నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽన్తరిక్షే యేదివియేషా మన్నం వాతో వర్ష మిషవస్తేభ్యోదశ ప్రాచీర్దశ దక్షిణాదశ ప్రతీచీర్దశోదీచీ ర్దశోర్ధ్వా స్తేభ్యో నమస్తేనో మృడయన్తు తేయం ద్విష్మోయశ్చ నో ద్వేష్టి తంవో జమ్భేదధామి ॥ ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ । ఉర్వారుక మివ బంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥ యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనా వివేశతస్మై రుద్రాయ నమో అస్తు ॥  ౨౮.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః ॥



# ఉత్తర శాంతి పాఠము

శన్నో మిత్రశ్శం వరుణః శన్నో భవత్వర్యమా ।

శన్న ఇన్ద్రో బృహస్పతిః శన్నో విష్ణు రురుక్రమః

నమో బ్రహ్మణే । నమస్తే వాయో ।

త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి ।

త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్ ।

ఋత మవాదిషమ్ । సత్య మవాదిషమ్ ।

తన్మామావీత్ । తద్వక్తార మావీత్ ।

ఆవీ న్మామ్ । ఆవీ ద్వక్తారమ్ ।

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

# సూక్త వివరణము

మంత్రము : నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః ।
నమస్తే అస్తుధన్వనే బాహుభ్యా ముత తే నమః॥

తా॥ ఓ రుద్రా ! నీ మన్యువునకు నమస్కారము. నీ ధనుస్సునకు నమస్కారము. నీ బాణమునకు నమస్కారము. నీ బాహువునకు నమస్కారము.

టీక : హే రుద్ర = ఓ రుద్రుడా ! తే = నీ యొక్క, మన్యవే = మన్యువునకు అనగా కోపమునకు, నమః = నమస్కారము, ఉత = మరియు, తే ఇషవే = నీ బాణమునకు, తే ధన్వతే = నీ ధనుస్సునకు, బాహుభ్యాం = రెండు బాహువులకు, నమః అస్తు = మా నమస్కారము అగుగాక !

విశేషము : రుద్రుడనగా రోదసి (Ether) కి అధిపతి. ఇతడు పదునొకండు రూపములలో వ్యక్తమగు నంతరిక్ష దేవత. పరమాత్మ యొక్క ప్రత్యక్షమూర్తుల (Tangeble entities)లో మొదటివాడు. ఒక్కొక్క బ్రహ్మాండమున దేవతలు మూడు గణములుగా వ్యక్తమగుదురు. (A) దివి దేవతలు లేక ఆదిత్యులు (Gods of Radiation); (B) అంతరిక్ష దేవతలు లేక రుద్రులు (Gods of Vibration); (C) పృథివీ దేవతలు లేక వసువులు (Gods of Materialisation). ఆదిత్యులు పండ్రెండుగురు, రుద్రులు పదునొకండు, వసువులు ఎనిమిది మంది. ఈ సంఖ్య ననుబట్టి వరుసగా జగతి, త్రిష్టుప్, అనుష్టుప్ అను ఛందస్సులు

పుట్టినవి. పదునొకండుగురు రుద్రుల రూపమున ప్రత్యక్షమగు రుద్రు డనబడు పరమాత్మతత్త్వము ఈ వేదమంత్రమున స్థాపింపబడును. ఈ మంత్రముతో మొదలైన సూక్తము "రుద్రాధ్యాయము" అనబడును. 'నమః' అను సంబోధనవలన దీనికి 'నమకము' అని పేరు వచ్చినది. ఇది శుక్ల యజుర్వేదమందలి పదునారవ అధ్యాయము. ఇందు పరమాత్మయొక్క సగుణ ధ్యానముగా సృష్టిలోని సమస్తరూపములు ధ్యానింపబడును.

మంత్రము : యాత ఇషుశ్శివతమా శివం బభూవ తే ధనుః ।
2 శివాశర వ్యాయా తవతయానో రుద్రమృడయ ॥

తా॥ ఓ రుద్రా ! నీవు ధరించుటవలన ధనుస్సు శుభ లక్షణమైనది. బాణము శివతరమైన చిహ్నమైనది. ధనుర్విద్య మాకు నీ వలన శివంకర మగునట్లుగా జేయుము.

టీక : తే = నీ యొక్క, ఇషః = బాణము, యా = ఏది కలదో (అది), శివతమా = మిక్కిలి శుభమైనది, తే ధనుః = నీ ధనుస్సు, శివం = శివకరము, బభూవ = అయ్యెను, యా = ఏదైతే, శరవ్యా = విలువిద్య కలదో, తవ = నీ యొక్క (అట్టి విలువిద్య), తయా = దానిచేత, నః = మమ్ము, మృడయ = సంతోషింప జేయుము.

విశేషము : శివశబ్దమునకు శుభము, మంగళము, విశ్వ శ్రేయము అని అర్థము. శివతమము అనగా అన్నిటిని మించిన శుభము. అదియే శివత్వము, శివసాయుజ్యము, బంధ మోచనము అనబడును. రుద్రుడు ధరించిన ధనుస్సు మన శిరస్సున బ్రహ్మరంధ్రమునుండి ముందువైపునకు భ్రూమధ్యము వరకు

నుండును. ఇచ్చట మన్యువు అనబడు శక్తి యుండును. శివుని ధనుస్సునకు రెండవ సగము బ్రహ్మరంధ్రము నుండి వెనుకకు మెడవరకు వ్యాపించి యుండును. మన శిరస్సున కనుబొమ్మల నుండి మెడవరకు అడ్డముగా పుఱ్ఱెపై వ్యాపించిన రేఖయే శివ ధనుస్సు, కనుకనే శివుడు కపాలము ధరించెనందురు. శిరస్సు పైనున్న ఆకాశమున గూడ నుదయము నుండి అస్తమయము వరకు సూర్యుని దారి (Arc) శివుని ధనుస్సు. అందు అహో రాత్రములు పుట్టును గనుక, శివుని మహాకాలుడు అందురు. మనస్సు, ఇంద్రియ ప్రవృత్తులు కపాలము క్రిందనుండి రుద్ర గ్రంథి (Medulla) మీదుగా పనిచేయును. ఐదు జ్ఞానేంద్రియములను, ఐదు కర్మేంద్రియములను, మనస్సును ఆశ్ర యించి రుద్రుని 11 రూపములు వ్యక్తమగును. ఇవియే శివుని బాణములు.

మంత్రము : యా తే రుద్ర శివా తనూ రఘోరా పాపకాశినీ ।
3 తయా న స్తనువా శన్తమయా గిరిశన్తాభి చాకశీహి ॥

తా॥ ఓ రుద్రుడా ! నీ మూర్తి శివంకరము, ప్రసన్నము అయినది. పుణ్యస్థితిని ప్రకాశింపచేయునది. ఉత్తమ శాంతిని కలిగించునది. నా వాక్కును పర్వతముగా గ్రహించి అందు శయనించిన ఓ రుద్రమూర్తీ ! నీ తనువుచే మాకు ప్రసన్ను డవు కమ్ము.

టీక : గిరిశంత = పర్వతమునందు (కైలాసము నందు) శయనించి శాంతిని చేకూర్చువాడా ! వాక్కునందు శయనించి శాంతిని చేకూర్చువాడా ! రుద్ర = ఓ రుద్రుడా ! తే = నీ

యొక్క, శివా = శుభమును కలిగించునది, అఘోరా = ఘోర రూపము కానిది, అనగా సౌమ్య రూపము ధరించినది. అపాప కాశినీ = అపాపమును అనగా నిర్మల పుణ్యతేజస్సును ప్రకాశింప జేయునది అగు, యా తనూ = ఏ వ్యాప్తమూర్తి కలదో, తయా తన్వా = అట్టి నీ తనువుచేత, శంతమయా = ఉత్తమ శాంతిని కలిగించు దానిచేత; అభి = మా కనుకూలముగా; చాకశీహి = మమ్ములను చూచు చుండుము.

విశేషము : తనువు అనగా రూపము, వ్యాప్తి, సాన్నిధ్యము. గిరిశంత = గిరి + శంత = గిరి పర్వతమునందు లేక వాక్కునందు లేక మేఘమునందు. పర్వతమునందు శయనించుట అనగా కైలాస నివాసము, వాక్కునందు నివసించుట యనగా అర్థము, తాత్పర్యము, అనుభూతి రూపము. వాక్కు, అర్థముగా పార్వతీ పరమేశ్వరులు కూడి యుందురని రఘువంశమున కాళిదాసు దీనినే కీర్తించెను. మేఘమునందు శయనించుట యనగా మెరపు, ఉరుము, పిడుగు రూపమున రుద్రుడు వృష్టి రూపముగా ప్రసన్నుడై భూమిని ఫలవంతము చేయుట. ఇచ్చట రుద్రుని ఇంద్రరూపము కీర్తింపబడినది.

మంత్రము : యామిషుం గిరిశంత హస్తే బిభర్ష్యస్తవే ।
4 శివాం గిరిత్ర తాం కురు మాహిగ్ంసీః
పురుషం జగత్ ॥

తా॥ మా వాక్కునందు శయనించియున్న ఓ రుద్రుడా : నీవు హస్తమున ధరించియున్న బాణమును శివకరముగా జేయుము. చరాచర సృష్టిలో నున్న పురుషునకు హింస కలుగ నీయకుము.

టీక : గిరిశంత = కైలాసపర్వతము నందు శయనించినవాడా ! గిరిత్ర = పర్వతమును రక్షించువాడా ! యాం ఇషుం = ఏ బాణమును, తవ = నీ యొక్క, హస్తే = హస్తము నందు, బిభర్ష్యః = ధరించు చుంటివో, తాం = దానిని, శివాం = శుభము ఇచ్చుదానినిగా, కురు = చేయుము, జగత్ = లోకముననున్న, పురుషం = జీవపురుషుని, మా హింసీః = హింసింపకుము.

విశేషము : రుద్రుడు కైలాసమున నంతర్యామిగా యోగనిద్రలో శయనించియున్న శివుడు. అతని చేతిలోనున్న అమ్ము జీవుని అహంకరణము. నిర్మలమైన బుద్ధిమయ కోశము, ఆనందమయ కోశము కైలాసము. దానిని రక్షించువాడు గనుక రుద్రుడు శివుడు. అతడు వక్తయందు వాక్కునుచ్చరించు శక్తిగను, వాక్కు అను శివుడుగను ఉండి వాక్కును రక్షించుచున్నాడు. కనుక జీవుని అహంకారమును తన మయము చేసి శుభము చేయును. సృష్టిలోని చరాచర జీవులలో ఈ అమ్ము రూపమున పురుషుడుగా శివుడున్నాడు. జీవుని పంచేంద్రియములు, పంచభూతములు తన చేతి ఐదు వ్రేళ్ళుగా అమ్మును పట్టుకొనగా ఒకరి నొకరు హింసించుకొనకుండ, శివుని గుర్తించు నుపదేశ వాక్కుగా జీవులవాక్కు శుభమగు గాక !

మంత్రము ; శివేన వచసాత్వా గిరిశాచ్ఛా వదామసి ।
యథానస్సర్వ మిజ్జగ దయక్ష్మగ్ం సుమనా
అసత్ ॥

తా॥ కైలాసగిరియందు శయనించిన ఓ రుద్రుడా !

శివంకరమైన వాక్కుచే స్తుతిరూపమైన వచనమున నిన్ను పొందుటకు మేము నిన్ను స్తోత్రము చేయుచున్నాము. ఈ సమస్త జగత్తునకును అనారోగ్యము లేకుండునట్లును మంచి మనస్సు కలిగి యుండునట్లును చేయుచు మా వాక్కునందు వసింపుము.

టీక : గిరిశ = పర్వతమునందు శయనించువాడా! లేక వాక్కునందు శయనించువాడా! శివేన = శుభకరమైన, వచసా = వాక్కుచేత, త్వా = నిన్ను, అచ్ఛ = పొందుటకు, వదామసి = పలుకుచున్నాము, నః = మాకు, సర్వం = సమస్తమైన, ఇత్ + జగత్ = ఈ స్థావర జంగమాత్మకమైన సృష్టి, అయక్ష్మగ్ం = అనారోగ్యము లేకుండునట్లుగా, సుమనాః = మంచిమనసు కలిగియుండునట్లుగా, యథా = ఏ విధముగా, అసత్ = అస్తిత్వము చెందునో (అట్లు పలికి స్తుతించెదము).

విశేషము : శివకరమైన వాక్కు అనగా లోకశ్రేయస్సును, శుభమును కలిగించునట్టి వాక్యము. జగత్తు అనగా స్థావర జంగమాత్మకమైన సృష్టి. యక్ష్మ అనగా క్షీణించుట, తరిగిపోవుట. అయక్ష్మ అనగా క్షీణింపకుండుట, తరుగకుండుట. జీవుల సృష్టిలో క్షీణించు భాగము కొంత, క్షీణింపని భాగము కొంత యుండును. దేహము, ఇంద్రియములు క్షీణించు భాగము. ఆత్మ క్షీణింపని భాగము. సుమనస్సు కలిగినపుడు ఈ సమస్తము భగవంతుని తత్త్వమే అను జ్ఞానము కలుగును. అప్పుడు జీవుడు శివుని స్వరూపమని తెలియును. అట్లు తెలియుటకు, తెలిసినది

జ్ఞప్తి యుండుటకు కావలసిన స్తుతిరూపమగు వాక్కును నిన్ను గూర్చి మే ముచ్చరించు చున్నామని భావము.

మంత్రము : అధ్యవోచ దధివక్తా ప్రథమో దైవ్యోభిషక్ ।
6 అహీగ్‌శ్చ సర్వాఞ్జమ్భయన్త్సర్వాశ్చయాతు
ధాన్యః ॥

తా॥ దివ్యులకు మొదటి వైద్యుడైన రుద్రుడు వాక్కుల కధిపతియై అధికారపూర్వకమైన వాక్కును ఆజ్ఞాపించును గాక! సర్వదుష్ట శక్తులను భయపెట్టి అదుపులో నుంచుచు, సమస్త భూత పిశాచాదులను హద్దుపెట్టుచు, తన వాక్కును ఆజ్ఞగా నుచ్చరించును గాక!

టీక : అధివక్తా = అధికార పూర్వకముగ పలుకువాడు, అధ్యవోచత్ = అధికార పూర్వకముగ పలుకుగాక! దైవ్యః = దివ్యులకు సంబంధించిన, ప్రథమః = మొట్టమొదటి, భిషక్ = వైద్యుడు, సర్వాన్ = సమస్తములైన, అహీన్ = సర్పములను లేక శత్రుశక్తులను, సర్వాన్ + చ = మరియు సమస్తములైన, యాతుధాన్యః = యాతుధానములు అనబడు పిశాచములను, జంభయన్ = నోరుతెరచి మ్రింగుచు, హద్దు పెట్టుచు.

విశేషము : రుద్రుడు ఇంద్రియములకును, మనస్సునకును ఆధిపత్యము వహించును. వానిని అనుభవించునపుడు ఇంద్రుడుగను, నియమించునపుడు రుద్రుడుగను చెప్పబడును. ఈ నియమించుట వలన దుష్టశక్తులు దమింపబడును. కామ క్రోధ రాగద్వేషాది బాధలు, దుఃఖము కలసి యొక పెద్ద వ్యాధి లక్షణముగా ప్రబలియుండును. ఆ వ్యాధినే సంసారము లేక

భవరోగము అందురు. ఆ దుఃఖములను శమింపజేసి భవరోగమును పోగొట్టునట్టి తన వాక్కును ఓంకార రూపమున మన కంఠధ్వని నుండి వినిపింపజేయును. కనుక నతడు దివ్యులకు సంబంధించిన మొదటి వైద్యుడనబడును.

మంత్రము : అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగలః ।
7 యేచేమాగ్ం రుద్రా అభితో దిక్షు ॥

తా॥ తామ్రవర్ణము గలవాడును, అరుణవర్ణము గలవాడును, అనేకవర్ణములు గలవాడును అగు ఈ శుభ స్వరూపుడు రుద్రుడు అనేక దిక్కులయందు మా ఎదుట బహు రూపములతో ప్రత్యక్షమై యున్నాడు. అట్టి రుద్రునకు నమస్కారము.

టీక : యః = ఎవడైతే, తామ్రః = రాగిరంగు కలవాడో, అరుణః = ఎరుపురంగు కలవాడో, ఉత = మరియు, బభ్రుః = రంగుల సమ్మేళనములైన రూపములు కలవాడో (ఆతడు), సుమంగలః = చక్కని శుభరూపము కలవాడు, అభితః = మా చుట్టును, దిక్షు = దిక్కులయందు, ఏచ = ఎవరైతే, ఇమాం రుద్రాః = ఈ రుద్రులు కలరో వారు (వారందరును అట్లే).

విశేషము : ఉదయించు సూర్యుడు తామ్రవర్ణము కలవాడు, అస్తమయ సూర్యుడు అరుణవర్ణము కలవాడు. మబ్బులపై నెండపొడ పడుచున్న సూర్యుడు ఇంద్రధనుస్సు రంగులు కలవాడు. ఇట్లు అన్ని ఋతువులందును అన్ని దిక్కులయందును కనిపించు సూర్యుని బింబరూపము లన్నియు కంటికి కనిపించు స్పందనాత్మకమైన రుద్రలోకమునకు సంబంధించిన రూపములు. కనుక రుద్రుని ప్రతిబింబములు, దైవముయొక్క

ప్రత్యక్ష రూపములు. ఇట్టి అనేక రూపములతో భాసిల్లు రుద్రుడు పరమాత్మయొక్క తేజోమయమైన రూపము. సూర్యోదయ సూర్యాస్తమయములు, వర్షము మొదలగు ఋతువులు, లోకమునకు వెలుగును. జ్ఞానమును, వర్షమును, అన్నమును ఇచ్చుచుండుటచే పరమాత్మయొక్క సుమంగళములైన రూపములు.

మంత్రము : శ్రితా స్సహస్రశోనై షాగ్ం హేడ ఈమహే।
8 అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః॥

తా॥ అనేక వర్ణముల రూపములు గల రుద్రులు దిక్కులయందు ఇతని కభిముఖముగా నాశ్రయించియున్నారు. వారు వేలసంఖ్యలో నున్నారు. అట్టి రుద్రుడు మాపై కోపింపకుండునట్లు ప్రార్థించు చున్నాము. పశ్చిమమున దిగిపోవుచున్న ఈ సూర్యుని అస్తమయసంధ్య రూపమున నున్న రుద్రుడు ఎఱ్ఱదనమును విడుచుచు, నీలమైన గ్రీవము రూపముతో మాకు ప్రత్యక్షమగుచున్నాడు.

టీక : సహస్రశః+వా = వేల వికల్ప రూపములుగా నున్న, ఏషాం = వీరియొక్క, హేడ = కోపము రంగును, ఈమహే = నివారణ చేయుచున్నాము, యః = ఎవడు, అవసర్పతి = అవాఙ్ముఖముగా దిగుచున్నాడో, అసౌ = అట్టి ఈ రుద్రుడు, నీలగ్రీవః = నల్లని కంఠము గలవాడు, విలోహితః = విరిగిన ఎరుపురంగు కలవాడు.

విశేషము : దిక్కులయందు వేలరూపములుగా నున్న రుద్రులనగా కాలపరిణామాత్మకులైన అహోరాత్ర సంధ్యామయ మూర్తులైన వెలుగుల రూపము కలవారు. కాలస్వరూపుని అహో

రాత్రముల యుచ్చారణ మందు ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా పని చేయుచున్న 'సోఽహం' అను మంత్ర వర్ణ మూర్తులతో రేఫము అగ్నిగా కూడినపుడు "సహస్ర" అను మంత్రము వారి రూపము అగును. ఈ వర్ణములచే సూచింపబడిన రంగులతో కూడిన అహోరాత్ర సంధ్యామయమైన సూర్యుని చక్రాకార గమనమే జీవుల కన్నుల దృష్టికి కూడ కారణము గనుక, ఈ 'సహస్ర' అను పదము "సుదర్శనము" అను మంత్రముగా కూడ చెప్పబడును. సంధ్యలో ఎరుపు విరిగి చీకటి వచ్చుటకు పశ్చిమమున దిగుచున్న సూర్యుడు కారణము గనుక అతడు నీలగ్రీవుడనియు, విరిగిన లోహిత వర్ణము కలవాడనియు వర్ణింపబడినది.

మంత్రము : ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః।
9 ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః॥

తా॥ మరియు ఇతనిని గోపకులు పరికించి చూచుచున్నారు. నీటిని కడవలతో ముంచుకొని పోవుచున్న స్త్రీలు కూడ చూచుచున్నారు. ఈ సమస్త జీవరాసులను ఉదయాస్తమయ సూర్యమండల రూపుడైన ఈ రుద్రమూర్తిని చూచుచునే యున్నారు. అట్లు చూడబడిన రుద్రుడు మాకు సుఖములను కలుగజేయును గాక!

టీక : ఉత = మరియు, ఏనం = ఇతనిని, గోపాః = గోపకులు, అదృశన్=చూచుచున్నారు, ఉదహార్యః=నీటిని గొనివచ్చువారు, ఉత = మరియు, విశ్వా భూతాని = సర్వజీవులను, ఏనం = ఇతనిని, అదృశన్ = చూచుచున్నారు, దృష్టః=చూడబడినట్టి, సః = అతడు, నః = మమ్ములను, మృడయాతి = సుఖింపఁజేయును.

విశేషము : సూర్యోదయ సూర్యాస్తమయ సమయము లందు పసుల కాపరులును, చెరువులలో నీరు కడవలతో ముంచుకొని పోవునట్టి స్త్రీలును, సూర్యమండల స్వరూపుడు, తామ్రారుణ వర్ణుడు అగు రుద్రుని చూచుచున్నారు. సర్వజీవరాసులును సూర్యుని చూడకుండుటకు వీలులేదు. అతడు కాలమును సూచించు కర్మ సాక్షియై వారి జీవితములను నడిపించుచున్నాడు. మరియు సర్వజీవులును వానిని చూచుచున్నారనగా చూపున కత డధిపతి యని అర్థము. అంతేగాక 'గోపాః' అను పదమునకు లోకములను రక్షించు లోకపాలకులని అర్థము. ఆకాశమునందు తారకా గోళములు కోటానుకోట్లు సూర్యమండలములై తదంతర్వర్తులైన దేవతలను సృష్టిపాలకులుగా వ్యక్తము చేయుచున్నవి. ఈ లోకపాలకులను వేదమున 'గోపాః' అను పదమున వ్యవహరించుట కవి సమయము. గొఱ్ఱెలను, పశువులను కాచుకొనుచున్న గొల్లల వలె ఈ దేవతలు సృష్టిని కాపాడుచున్నారని భావము. ఉదాహరణ : "ఇనో విశ్వస్య భువనస్య గోపాః సమాధీరః పాకమత్రా వివేశ"-ఋగ్వేదము 1-164-11. అట్టి గోపులు కాలమును సృష్టించుటకై సూర్యోదయాస్తమయాదుల నపేక్షించు చున్నారని భావము. అట్లే నీటిని కొనిపోవుచున్నా వా రనగా మేఘములు. అవికూడ తమ ఋతు నిర్ణయమునకై సూర్యమూర్తి నపేక్షించు చున్నవి.

మంత్రము: నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే।
10 అథో యే అస్యసత్వానోఽహం
తేభ్యోఽకరం నమః ॥

తా॥ నీలకంఠుడు, సహస్రాక్షుడు, వర్షించు చల్లని దేవుడు

అగు రుద్రునకు నమస్కారము. మరియు వాని సత్త్వము గల ఇతర రుద్రరూపు లందరకును నేను నమస్కరించుచున్నాను.

టీక : నీలగ్రీవాయ = నీలకంఠునకు, సహస్రాక్షాయ = వేయికన్నులవానికి, మీఢుషే = వర్షించువానికి, నమః + అస్తు = నమస్కారము చెందును గాక ! అథః = అటుపైని, అస్య = ఇతని యొక్క, సత్వానః = సత్త్వస్వరూపులకు, తేభ్యః = వారికి, అహం = నేను, నమః = నమస్కారమును, అకరమ్ = చేయుచున్నాను.

విశేషము : 1) మేఘములతో నలంకరింపబడిన సూర్యరూపుడు, అస్తమయ కాలమున సూర్యస్వరూపుడు అగు రుద్రుడు నీలగ్రీవుడు అనబడును. 2) సహస్రాక్షుడు అనగా నింద్రుడు. రుద్రుని యొక్క వివిధ రూపములలో మేఘముల నాకర్షించు కిరణములు వేలుగా గల సూర్యుని సహస్రాక్షుడైన ఇంద్రుడందురు. 3) మీఢుషే అనగా వర్షించు లక్షణము గలవాడు. వర్షకాలమున సూర్యుడు, మరియు సంతానమునకు గర్భధారణము చేయించగల వయస్సులో నున్న పురుషుడు వీరందరును రుద్రుని రూపములు. 4) సత్త్వములు అనగా జీవరాశులు, సత్త్వ మనగా శక్తి. జీవులన్నియు రుద్రుని శక్తిస్వరూపములు మరియు సత్త్వ మనగా సత్త్వగుణము. భగవంతుని తెలిసికొనుటకు పనికివచ్చు సత్త్వగుణముగల వారందరు రుద్రుని స్వరూపములే. కనుక వారికిని నమస్కారము.

మంత్రము : ప్రముంచ ధన్వన స్త్వముభయోరార్త్ని

11

యోర్జ్యామ్ ।

యాశ్చ తే హస్త ఇషవః పరా తా భగవో వప ॥

తా॥ ఓ భగవానుడా! నీ ధనుస్సు యొక్క రెండంచుల యందు గల అల్లె త్రాటిని తొలగింపుము. మరియు నీ చేతిలో గల బాణములను గూడ దూరముగా తొలగింపుము.

టీక : భగవః = ఓ భగవానుడా! ధన్వనః = ధనుస్సు యొక్క, ఉభయోః = రెండిటియొక్క, అర్త్న్యోః = రెండు కోటుల (అంచుల) యందును (ఉన్న), జ్యాం = అల్లె త్రాటిని, త్వం = నీవు, ప్రముంచ = విడువుము, యాః = ఏవి, తే = నీ యొక్క, హస్తే = హస్తమునందు, ఇషవః = అమ్ములు కలవో, తాచ = వానిని కూడ, పరావప = పారవేయుము.

విశేషము : 1) విల్లమ్ములు ధరించినపుడు రుద్రుడు సంహారరూపుడు. వానిని విడిచినపుడు రక్షణస్వరూపుడు. 2) విల్లు జీవుల భ్రూమధ్యమునుండి నడినెత్తిమీదుగా వెన్నెముకవెంట తెలిసికొనదగు భాగము. ఇందు సర్వప్రవృత్తులను దమించు దిట్టతనముండును. అట్లు దమించు రుద్రుని పశుపతి యందురు. ఈ విల్లు పుట్టె మీదుగా చుట్టి యుండును గనుక రుద్రుడు పుట్టెను ధరించెనని గూడ చెప్పుదురు. 3) ధనుస్సుయొక్క రెండంచులు అనగా ఊర్ధ్వలోకము, అధోలోకము, జ్ఞానాజ్ఞానములు, సుఖదుఃఖములు మున్నగు ద్వంద్వములు. అందు దివ్యశక్తులు భ్రూమధ్యమునను, భూతగణములు మూలాధారమునను ఉండును. ఈ రెండింటిని కలిపి బిగించిన త్రాడు సంసారము. దానిని తొలగింపగా బిగువు సడలిపోవును. 4) అమ్ములు అనగా ఇంద్రియములు. ఇవి రుద్రునిచేతిలో నున్నపుడు సాధన జరుగును. వానిని రుద్రుడు తొలగించినపుడు జీవి తానగును. ఇట్లు చేయుట వలన రుద్రుడు పశుపతి అనబడును.

మంత్రము : అవతత్య ధనుస్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే।
12 నిశీర్య శల్యానాం ముఖాశివోనః సుమనా భవ॥

తా॥ వేయి కన్నులు, నూరు అమ్ములపొదులు గల రుద్రుడా ! నీ ధనుస్సును దింపి బాణముల ములుకులను ప్రక్కకు పడవైచి మా యందు అనుకూల మనస్సు కలిగి శుభమును కలిగించుము.

టీక : సహస్రాక్ష=వేయి కన్నులు గలవాడా ! శతేషుధే=నూరు అమ్ముల పొదులు గలవాడా ! త్వం=నీవు, ధనుః=ధనుస్సును, అవతత్య=అల్లె త్రాటినుండి దింపి, శల్యానాం=అమ్ముల ములుకులయొక్క, ముఖాః=వాడియగు కొనలను, నిశీర్య=చెదరగొట్టి (మాపైపునకు ఎక్కు పెట్టకుండ త్రిప్పి), నః=మా యెడల, శివః=శుభము కలిగించువాడవు, సుమనాః=మంచి మనస్సు గలవాడవు, భవ=అగుము.

విశేషము : 1) సహస్రాక్షుడు అనగా వేయి కన్నులు గలవాడు అని సామాన్యార్థము. వేయి కిరణములు కలవాడని విశేషార్థము. సూర్యుడు రుద్రలోకమున మన కన్నులకు కనిపించు వేయి కిరణములు కలవాడు. రుద్రుని ఈ రూపమునే ఇంద్రుడని వేదములు చెప్పును. మరియు సహస్రాక్షుడు అనగా వేయి అక్షములు (Spokes) కలవాడు. 2) ఇషుధి అనగా అమ్ములపొది, ఇది మనస్సునకు సంకేతము. పంచేంద్రియములు అమ్ములుగను, మనస్సు తూణీరముగను చెప్పబడును. రుద్రుడు నూరు ధనుస్సులు కలవాడు అనగా మనస్సున నున్న అనేకమైన ప్రజ్ఞల కధిపతి.

మంత్రము : విజ్యంధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత।
13 అనేశన్నస్యేషవ ఆభురస్య నిషంగథిః ॥

తా॥ జటాజూటము ధరించిన రుద్రుని ధనుస్సు నుండి అల్లెత్రాడు దింపబడుగాక! అమ్ముల పొదినుండి ములుకులు తొలగింపబడు గాక! ఇతని యమ్ములు ఉపయోగింపబడకుండుగాక! [అట్టి ఆవశ్యకత కలుగకుండుగాక] ఇతని అమ్ముల పొది ఖాళీగా నుంచబడు గాక! [యుద్ధము లేకుండుగాక యని యర్థము].

టీక : కపర్దినః = శివునియొక్క, ధనుః = ధనుస్సు, విజ్యం = అల్లెత్రాడు దింపబడుగాక, బాణవాగ్ం = అమ్ములపొది, విశల్యః = ములుకులు లేనిది, ఉత = మరియు, అస్య = ఇతని యొక్క, యాఇషవః = ఏ అమ్ములుగలవో [అవి], అనేశన్ = ఉపయోగించువాడు లేనివి యగు గాక! అస్య = ఇతనియొక్క, నిషంగథిః = అమ్ములపొది, ఆభుః = ఖాళీయగు గాక!

విశేషము : 1) కపర్దము అనగా జడలచుట్ట. రుద్రుడు జడలచుట్ట ధరించినవాడు గనుక కపర్ది. సంకల్పము లన్నియు చుట్టచుట్టి ముడివేయబడిన స్థానము కపర్దమని సంకేతము. రుద్రుని యందు జీవులకు సంయమము చెందుట సిద్ధించును గనుక నతడు కపర్ది.

2) బాహ్య వస్తువులయందు సంకల్పములు నిలిచినపుడు రుద్రుడు ధనుస్సు నెక్కుపెట్టి బాణముల ములుకులను జీవులవైపు త్రిప్పియుండును. మానవులకు సంకల్పముల బిగువు కలిగినపుడు రుద్రుని ధనుస్సు బిఱ్ఱుగా లాగి పెట్టబడును. జీవులలో నొకరి సంక

ల్పము లోకరిని బాధించినపుడు రుద్రుని బాణములు వారి కామ క్రోధాదులపై ప్రయోగింపబడును. సంకల్పములను రుద్రుని యందు విడిచినపుడు అతడు ధనుస్సు వదులుచేసి అల్లెత్రాడు దించి అమ్ములపొదులు ఖాళీచేయును. అదియే నిర్వికారమగు సమాధిస్థితి.

మంత్రము : యాతే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః।
14 తయాస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయా పరిబ్భుజ॥

తా॥ నీ హస్తమునందు నిలిచియున్న ఆయుధమైన ధనుస్సువలన మా కందరకును అన్ని దిక్కులయందు హాని కలుగకుండ వృద్ధి కలుగునట్లు సంకల్పింపుము.

టీక : మీఢుష్టమ=స్తోత్రము చేయదగినవారిలో ఉత్తముడైనవాడా ! యా=ఏదైతే, తే హస్తే=నీ హస్తమునందు, ధనుః=ధనుస్సు, హేతిః=ఆయుధముగా, బభూవ= అయ్యెనో, తయా=దానిచే, అయక్ష్మయా=తిరుగులేనట్టిదియైన దానిచేత, విశ్వతః+సమస్తమునందును, అస్మాన్=మమ్ములను, పరిబ్భుజ=అన్ని దిక్కుల యందును రక్షించుము.

విశేషము : హేతి యనగా ఆయుధము హస్తముల యందున్న నీ ధనుస్సు నీకు ఆయుధమయ్యెను. అనగా మా పంచేంద్రియములతో కూడిన శరీరమును నడుపు ధనుస్సు అయిన మా వెన్నెముకను వంచి నీకు సమర్పణము చేయుచున్నాము అని అర్థము. నీ హస్తమునందు ఉన్న ఆయుధమనగా మా హస్తములచే సమర్పించు నమస్కార ముద్రయని అర్థము. దానివలన

మాకు క్షీణత లేకుండ అనుగ్రహింపుమని తాత్పర్యము. రుద్రునకు సమర్పించిన సమస్తముచేత రుద్రుని యందున్న అస్త్రముగా విశ్వమందలి వారు నిలువ గలరనియు, దానివలన అవ్రియత్న రక్షణము జరుగునని భావము.

మంత్రము : నమస్తే అస్త్వాయుధాయాఽనాతతాయ
15 ధృష్ణవే ।
ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవధన్వనే॥

తా॥ ఓ రుద్రా! ఎక్కుపెట్టక భయపెట్టుటకు ధరించిన ఆయుధమగు నీ ధనస్సునకు నమస్కారము. అట్టి ధనుస్సును ధరించియున్న నీ ఉభయ బాహువులకు నా నమస్కారము.

టీక : అనాతతాయ=ఎక్కు పెట్టినట్టి, ధృష్ణవే=భయపెట్టు లక్షణము మాత్రముగల, తే ఆయుధాయ = నీ ఆయుధమునకు, నమః = నమస్కారము, ఉత = మరియు, తే = నీయొక్క, ఉభాభ్యాం, బాహుభ్యాం = రెండు బాహువులకు, తవ = నీయొక్క, ధన్వనే = ధనుస్సునకు, నమః = నమస్కారము.

విశేషము : బాహువు అనగా ఒక కోణమునకు రెండు ప్రక్కల నుండు సరళరేఖలు. ఆకాశమున తూర్పునుండి పడమరకు సూర్యుడు ప్రొద్దుచూపుచు తిరుగు మార్గము రుద్రుని ధనుస్సుగా ప్రశంసింపబడినది. రుద్రుడు కాలస్వరూపుడు. సూర్యోదయమున అరుణవర్ణుడు, సూర్యాస్తమయమున తామ్రవర్ణుడుగా అతడు వ్యక్తమగును. మననుండి తూర్పును గమనించుటకు ప్రసరించు దృష్టి ఒక బాహువుగా వర్ణింపబడినది. ఈ నడుచు సూర్యుని గమనముచే కాలము మన జీవితముగా

కొలువబడును. ఈ ధనుస్సు జనన మరణముల రూపమున వయస్సు, వ్యాధి, కర్మఫలములు, ముసలితనము మున్నగు వాని రూపమున భయము కలిగించుచున్నను, రుద్రుని ధ్యానించువారికి కామక్రోధాది శతృవుల నాశనము మాత్రము కలిగించి, మనలను శాశ్వత స్వరూపులైన రుద్రమూర్తులుగా దర్శింప జేయును.

మంత్రము : పరితే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః ।
16 అథోయ ఇషుధిస్తవారే అస్మన్నిధేహితమ్ ॥

తా॥ ఓ రుద్రుడా ! నీ ధనుస్సు నందలి బాణము మమ్ము ఏ వైపునను తాకకుండ విడుచుగాక ! నీ అమ్ములపొది కూడ మాకు దూరముగా నుంచుము.

టీక : తే = నీయొక్క, ధన్వనః = ధనుస్సుయొక్క, హేతిః = బాణము, అస్మాన్ = మమ్ము, విశ్వతః + పరి = విశ్వము నందంతటను, వృణక్తు = విడుచునుగాక, అథః = మరియు, తవ = నీయొక్క, ఇషుధిః = అమ్ములపొది, యః = ఏది కలదో, తం = దానిని, అస్మత్ = మానుండి, ఆరే = దూరముగా, నిధేహి = ఉంచుము.

విశేషము : రుద్రుని ధనుస్సు నందలి బాణము అనగా మనము చేయు నమస్కార ముద్ర. రుద్రునకు చేసిన నమస్కారము విశ్వమందెక్కడ నున్నను మనలను రక్షించునని భావము. దుష్కర్మకు ఫలముగా మన మనుభవించు శిక్షయే రుద్రుని బాణము మనలను హింసించుట. దుష్కర్మలకు తావు

లేకుండ సర్వదా శివార్పణముగా సత్కర్మ లాచరించు చున్నప్పుడు మన శివార్పణ బుద్ధియే మన మెక్కడ నున్ననుఎట్టి స్థితిలో నున్నను రక్షించును. రుద్రుని అమ్ములపొది అనగా మన దుష్కర్మల యొక్క విలువ. సర్వము శివార్పణముగా సత్కర్మ లాచరించువారి పూర్వ దుష్కర్మలను కూడ శివుడు తొలగించు నని తాత్పర్యము.

మంత్రము : నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ, మహా
17 దేవాయ, త్ర్యంబకాయ, త్రిపురాంతకాయ,
త్రికాగ్ని కాలాయ, కాలాగ్ని రుద్రాయ, నీల
కంఠాయ, మృత్యుంజయాయ, సర్వేశ్వరాయ,
సదాశివాయ, శ్రీమన్మహాదేవాయ నమః ॥

తా॥ భగవానుడు, సర్వమున కీశ్వరుడు, దేవతలకు దేవుడు, త్రినేత్రుడు, త్రిపురములను దహించినవాడు, మూడగ్నులు కలవాడు, కాలస్వరూపుడు, ప్రళయాగ్ని స్వరూపుడు, నీలకంఠుడు, మృత్యువును జయించిన వాడు, ఎల్లర హృదయముల కీశ్వరుడు, ఎల్లప్పుడు శుభముల నిచ్చు వాడు, సంపదల కధిదేవత అగువానికి నమస్కారము.

టీక : భగవాన్=అష్టైశ్వర్యముల కధిపతి, మహిమలు కలవాడు అగు, విశ్వేశ్వరాయ=లోకముల కీశ్వరునికి, మహాదేవాయ = దేవతలకు, దేవునికి, త్రి + అంబకాయ = మూడు కన్నులు గలవానికి, త్రిపురాంతకాయ = మూడు పురములు అంతము చేయువానికి, త్రికాగ్ని కాలాయ = మూడగ్నులతోడి

కాల స్వరూపునకు, కాలాగ్ని రుద్రాయ = ప్రళయాగ్ని స్వరూపునకు, నీలకంఠాయ = నల్లని కంఠము గలవానికి, మృత్యుంజయాయ = మృత్యువును జయించినవానికి, సర్వ + ఈశ్వరాయ = అందరి హృదయములలోని ఈశ్వరునకు, సదా శివాయ = ఎల్లప్పుడు శుభములు కలిగించువానికి, శ్రీమత్ = మహాదేవాయ = సంపదలుకల మహాదేవునకు, తే = నీకు, నమః అస్తు = నమస్కరింతును గాక :

విశేషము : ఇది రుద్రమంత్రముల లోనిది కాదు.

మంత్రము : నమో హిరణ్య బాహవే, సేనాన్యే దిశాంచ
18 పతయే నమః ॥

తా॥ బంగారు రంగు కిరణములే బాహువులుగా గల సూర్యుని రూపమున వెలుగుచున్న దేవుడే రుద్రుడు. అట్టి బంగారు బాహువులుగల రుద్రునకు నమస్కారము. దేవతల సేనలకు నాయకుడును, దిక్కులకు అధిపతియు అగు రుద్రునకు నమస్కారము.

టీక : హిరణ్యబాహవే = బంగారు బాహువులు కలవాని కొరకు, సేనాన్యే = సేనలను నడిపించువాని కొరకు, దిశాం = దిక్కులకు, పతయే = అధిపతికొరకు, చ = మరియు, నమః = నమస్కారము.

విశేషము : రుద్రుడు సూర్యుని రూపముగా ప్రార్థింపబడుచున్నాడు. వెలుగులను వెదజల్లు సూర్యుని కిరణములు బంగారు వెలుగుచే నలంకరింపబడిన బాహువులుగా కీర్తింపబడి

నవి. వెలుగులు చీకటులను పారద్రోలును గనుక రాక్షస సేనలను ఓడించు దేవతల సేనలుగా, రుద్రుడు ఆ సేనల కధిపతియైన కుమారస్వామిగా వర్ణింపబడుచున్నాడు. కిరణములు దిక్కులకు వ్యాపించి వెలిగించును గనుక రుద్రుడు దిక్కుల కధిపతిగా చెప్పబడెను.

మంత్రము : నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం
19 పతయే నమః ॥

తా॥ ఆకుపచ్చని కేశములవలె గుబురులుగా పెరిగిన ఆకులతో గూడిన వృక్షములకు నమస్కారము. పశువుల కధిపతియైన రుద్రునకు నమస్కారము.

టీక : హరికేశేభ్యః = ఆకుపచ్చని కేశములు (కేశముల వలె పెరుగు వర్ణములు) కలవాని కొరకు, వృక్షేభ్యః _ వృక్షముల కొరకు, నమః = నమస్కారము, పశూనాం = పశువుల యొక్క, పతయే = పాలకుని కొరకు, నమః = నమస్కారము.

విశేషము : గుబురుగా పెరుగునట్టి ఆకులు వృక్షములకు కేశములుగా వర్ణింపబడినవి. పెరుగునట్టి శక్తి ఆకులలో లీనమై యుండుటచే వృక్షములు రుద్రుని అనేక రూపములలో నొక రూపము. పశువులనగా పాడికి, పంటకు నుపకరించునవి గనుక రుద్రుని రూపములు. మరియు కట్టబడిన పాశముతో గుంజ చుట్టును పశువులు తిరుగుచుండును. అట్లే కిరణముల ఆకర్షణ శక్తిచే బంధింపబడి సూర్యుడను గుంజచుట్టును గ్రహములు, ఇంద్రియముల ప్రవృత్తులు తిరుగుచుండును. ఇవి అన్నియు

పశువులని వేదార్థము. వీని కధిపతి పశుపతి అనబడును. అతడే రుద్రుడు.

మంత్రము : నమ స్సస్పింజరాయ త్విషీమతే పథీనాం
20 పతయే నమః ॥

తా॥ నవనవలాడుచు మొలిచిన లేతపచ్చిక మొక్కల కుచ్చుల రూపమున కనిపించు వన్నెచిన్నెలు గలవాడును, అనేకములైన మార్గముల కధిపతియు నగు రుద్రునకు నమస్కారము.

టీక : స్సస్పింజరాయ = లేత పచ్చిక కుచ్చుల రూపము కలవాని కొరకు, త్విషీమతే = వన్నెచిన్నెలు కలవాని కొరకు, నమః = నమస్కారము, పథీనాం = మార్గములయొక్క, మార్గమున బోవువారియొక్క, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1) ఒక కేంద్రము నుండి అనేక దిక్కులకు గడ్డి మొక్కల ఆకులు కుచ్చులుగా ప్రసరించును. అట్లే చోటులో ప్రతి బిందువు కేంద్రమై దానినుండి అనేక శక్తులు కిరణముల వలె సృష్టింపబడి వ్యక్తమగు చుండును.

2) అట్లే సూర్యుడను నొక కేంద్రమునుండి అనేక కాంతులు వన్నెచిన్నెల ఇంద్రధనుస్సులై వర్తించుచుండును. వానినుండి లోకములు గ్రహగోళాదులు పుట్టుచుండును.

3) ఈ గోళములు సూర్యునిచుట్టును తిరుగుచుండగా అనేక

మార్గములు ఏర్పడుచున్నవి. జీవులకు కాలమానము, దూర మానము, దిక్కులు అను దారు లేర్పడుచున్నవి. ఈ దారుల కన్నిటికి నధిపతి యగు రుద్రునకు నమస్కారము.

మంత్రము : నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః॥
21

తా॥ వృషభము వాహనముగా శయనించువాడు, వ్యాధు లచే స్పృశింపబడని మృత్యుంజయత్వము గలవాడు, అన్న స్వరూపమైన సంపదలకు పాలకుడు అగు రుద్రునకు నమస్కారము.

టీక : బభ్లుశాయ = ఎద్దు నెక్కినవాని కొరకు, వివ్యాధినే = వ్యాధులు స్పృశింపని వానికొరకు, అన్నానాం = అన్నముల యొక్క, పతయే = అధిపతి అగు రుద్రుని కొరకు, నమః = నమ స్కారము.

విశేషము : 1) వృషభము అనగా వృషభరాశి. ఇది బ్రహ్మచర్యమున ఊర్ధ్వగతి చెంది బ్రహ్మవర్చస్సునకు కారణ మైన శుక్రమునకు సంకేతము. ఈ వర్చస్సువలన మూడవ కన్ను తెరచుకొని సాధకునిలో కామదహనము జరుగును. అతడు శివస్వరూపు డగును.

2) రుద్ర మంత్రములు రోగములను పారద్రోలి ఆయు రారోగ్యములను వృద్ధిచేయును. కనుక రుద్రుడు వ్యాధిచే స్పృశింపబడ డని కీర్తింపబడినది.

3) అన్నము, వర్షమువలన వృక్షసంపద మొదలగునవి వర్ధిల్లును. వృషభరాశిలో సూర్యుని రూపమున రుద్రుడు చరించు

నపుడు వేసవికాలము వచ్చును. భూమిపై జలములు ఆవిరియై పరితప్త భత చెంది పైకి పోవును. దీనివలన మేఘము లేర్పడును. మేఘముల వలన వర్షము, అన్నము కలుగును.

మంత్రము : నమో హరికేశాయోపవీతినే పుష్టానాం
22 పతయే నమః ॥

తా॥ ఆకుపచ్చని వృక్ష సంపద, సస్య సంపద, ఘాసము తన కేశములుగా అలంకరించుకొనిన వాడును, పచ్చగా అల్లుకొనిన తీగల దుబ్బులను యజ్ఞోపవీతములైన తన యుత్తరీయములుగా సొగసు చేసికొన్నవాడును, తన కరుణవలన పుష్టి చెందిన సమస్త వృక్ష సంపదను పాలించువాడును అగు రుద్రునకు నమస్కారము.

టీక : హరికేశాయ = ఆకుపచ్చని కేశములు గలవాని కొఱకు, ఉపవీతినే = యజ్ఞోపవీతములను, ఉత్తరీయములను దరించిన వానికొఱకు, పుష్టానాం = పోషింపబడిన వారికి, పతయే = అధిపతియగు వానికొరకు, నమః = నమస్కారము.

విశేషము : 1) సూర్యుడు, భూమి, వర్షసంపదయు రుద్రుని సగుణ రూపములు. వర్షము వలన వచ్చిక, మొక్కలు పెరిగి భూమి పచ్చబడును. ఈ జీవ సంపదయే రుద్రుని కలంకారము లగు కేశములు.

2) పూలతీగెలు పెరిగి అల్లుకొనగా నవియే రుద్రుని యజ్ఞోపవీతములును, ఉత్తరీయములును. పువ్వులును, చిగుళ్ళును ఉత్తరీయముల రంగుల అంచులు.

3) పై సంపద యంతయు సూర్యరూపుడైన రుద్రునిచే సూర్యరశ్మి, జలములు, వాయువులు, ఆహారముగా పోషింప బడినది. కనుక రుద్రుడే ఈ తోటలకును, దొడ్లకును అధిపతి. వానిని తిని జీవించు జంతువులకు, పక్షులకు, నరులకును గూడ అధిపతి. ఈ మొత్తమును యజ్ఞమందురు. కనుక అతడు యజమానుడు లేక యజ్ఞమునకు అధిపతి.

మంత్రము : నమో భవస్య హేత్యై॰ జగతాం పతయే నమః॥

23

తా॥ సంసార తాపత్రయమును ఛేదించునట్టి ఆయుధ స్వరూపుడైన రుద్రునకు నమస్కారము. లోకములను పరిపాలించి రక్షించునట్టి రుద్రునకు నమస్కారము.

టీక : భవస్య = సంసారమునకు, హేత్యైః = ఆయుధ స్వరూపునకు (భవస్య = రుద్రుని యొక్క, హేత్యైః = ఆయుధమునకు), నమః = నమస్కారము, జగతాం = లోకములకు, పతయే = పాలించువాడైన రుద్రునకు, నమః = నమస్కారము.

విశేషము : 1) భవమనగా సంసారము. భవుడనగా రుద్రుడు. అంతర్యామియైన దేవుని విశ్వరూపమే మోహము వలన సంసారముగ కనిపించుచు జీవులు తమ్ము తామే బంధించుకొనుచున్నారు.

2) హేతి యనగా నాయుధము. ఈ మంత్రమందలి భవ శబ్దమునకుగల శ్లేషవలన రుద్రుడే ఆయుధ స్వరూపుడుగ సంసార బంధములను ఛేదించుచున్నాడని చమత్కరింప బడినది. సంసారమనగా జీవులు పరస్పరము ఆరోపణ చేసికొను సంబంధము.

3) జగత్తులు అనగా లోకములు. ఇవి ప్రధానముగ మూడు : భూలోకము, భువర్లోకము, సువర్లోకము. అందు మొదటిది భౌతికము, ద్రవ్యమయము. రెండవది శక్తిమయము. మూడవది ప్రజ్ఞామయము. మూడును రుద్రునకు తన్మయములు. ఇందొక్కొక్క లోకమున ఏడేసి లోకముల చొప్పున అంతర్లోకములు ఇమిడి యున్నవి. ఇన్నిటిలో తానేయుండి రుద్రుడు పోషణ రక్షణాదులను నిర్వర్తించుచున్నాడు.

మంత్రము : నమో రుద్రాయాఽఽతతావినే క్షేత్రాణాం
24 పతయే నమః। నమస్సూతాయాఽహన్త్యాయ
వనానాం పతయే నమః॥

తా॥ ఎక్కుపెట్టిన అల్లెత్రాడుతో కూడిన ధనుస్సు కలవాడును, క్షేత్రముల కధిపతియు, సారథియు, ఎవరి చేతను చంపబడనివాడును, వనములను పాలించువాడును అగు రుద్రునకు నమస్కారము.

టీక : ఆతతావినే = విస్తారమైన అల్లెత్రాడు గలవానికి, క్షేత్రాణాం = క్షేత్రములకు, పతయే = అధిపతికి, సూతాయ = సారథికి, అహన్త్యాయ = చంపుటకు శక్యముకానివానికి లేక అహంకారమును తస్కరించువానికి, వనానాం = వనములకు, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1) వెన్నెముక విల్లు. బ్రహ్మరంధ్రము అల్లెత్రాడు. వానిని ధరించిన యోగవిద్యాధిదేవత రుద్రుడు.

2) క్షేత్రములనగా శరీరములు. శరీరములలో జీవుని రూపమున వసించుచు దేవుని రూపమున రక్షించువాడు.

3) జీవయాత్రకు శరీరము రథము. దానికి సారథి అనగా నియమము అను పగ్గము పట్టి, సాధన యను ప్రయాణమున మోక్షమను గమ్యము జేర్చువాడు.

4) దేవుడు ఆత్మస్వరూపుడు. వానియందు శరీరాదులు, మనస్సు ఉండును గనుక వానిచే నతడు చంపబడడు. వానితో నశింపడు.

5) వనములు, జంతువులు, వృక్షములు, సకల భూచరములును సృష్టికి మూలములు, ఆశ్రయములు. మేఘములకు, వర్షములకు దోహదములు, తపస్సున కనుకూలములు. వాని కధిపతి రుద్రుడు.

మంత్రము : నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం
25 పతయే నమః। నమో మన్త్రిణే వాణిజాయ
కక్షాణాం పతయే నమః ॥

తా॥ ఎఱ్ఱని రంగు గలవాడును, లోకములను స్థాపించువాడును, వృక్షముల కధిపతియు అగు రుద్రునకు నమస్కారము. తనను మననము చేయువారిని రక్షించువాడును, వాణిజ్యమునకు సంబంధించిన వాడును, పొదరిండ్లను పాలించువాడును అగు రుద్రునకు నమస్కారము.

టీక : రోహితాయ = ఎఱ్ఱని రంగు గలవానికి, స్థపతయే = లోకములను స్థాపించువానికి, వృక్షాణాం = వృక్షములయొక్క, పతయే = అధిపతికి, మన్త్రిణే = మననము చేయువారిని రక్షించువానికి, వాణిజాయ = వాణిజ్యమునకు సంబంధించినవానికి, కక్షా

ణామ్ = పొదరిండ్లకు, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1] రోహితుడు అనగా ఎఱ్ఱనివాడు. ఇచ్చట ఉదయించు, అస్తమించు సూర్యుని రూపమువాడు. ఆరోహణ, అవరోహణలు ఆకాశమున చేయువాడని గూఢ అర్థము.

2] స్థపతి : స్థాపించువాడు. సూర్యుని, గ్రహ గోళాదులను స్థాపించువాడు. జీవులను దేహములతో స్థాపించువాడు. మానవులచే గృహములను, ఆలయములను స్థాపింప జేయువాడు.

2] వృక్షముల కధిపతి : సూర్యుని రూపమున ఆహారమిచ్చుట, చంద్రుని రూపమున మొలకెత్తించుట, వర్షన్యుని రూపమున రైతుగా నీరు పట్టుట చేయును.

4] మన్త్రి : మననము అనగా ధ్యానము. అది చేయువారిని రక్షించువాడు, మంత్రదేవత. హృదయముల నుండి గురువు, మిత్రుడు మున్నగు రూపములనుండి సలహానిచ్చు వాడు.

మంత్రము : నమో భువన్తయే వారివస్కృతాయౌషధీనాం పతయే నమః ।

26

తా॥ భూమిపై జీవుల సంపదను వృద్ధి చేయువాడును, వారికి కావలసిన అన్నోదకముల సంపదను సమకూర్చు వాడును, సస్యములకు అధిపతియు అగు రుద్రునకు నమస్కారము.

టీక : భువన్తయే = భూమిపై పుట్టుచున్న జీవుల రూపములను వృద్ధిచేయువాడు, వారివస్కృతాయ = జలము, వస్త్రము,

వసించుటకు కావలసిన సంపద కలిగించువాడు, ఓషధీనాం పతయే = సస్యరూపములగు ధాన్యముల కధిపతి అగువానికి, నమః = నమస్కారము.

విశేషము : 1] భువన్తుడు, పుట్టుక కల ఉపాధిపై జీవుల రూపములు కలవాడు. ఆ రూపములను కలిగించువాడు, వారుగా వసించువాడు.

2] వారి వస్కృతుడు : జలము, వసతి, వస్త్రము నిచ్చు వాడు. వర్జన్యుడుగా జలమిచ్చును. భూమి, ఆకాశములుగా వసతి నిచ్చును. వృక్షములుగా వస్త్రాదు లిచ్చును.

3] ఓషధులకు అధిపతి : ఓషధు లనగా పంట పండిన వెంటనే మొక్కలు చనిపోవునవి. ధాన్యములు మున్నగు సస్యములు. సంవత్సరమను యజ్ఞమున ఋతువుల ధర్మములు నిర్వహింప బడుచుండగా సస్యాదులు రుద్రునిచే అనుగ్రహింపబడి జీవుల కాహార మగుచున్నవి.

మంత్రము : నమ ఉచ్చైర్ఘోషాయాఽఽక్రన్దయతే
27 పత్తీనాం పతయే నమః ।

తా॥ ఉరుముల పిడుగుల రూపమున పెద్ద శబ్దము చేయు వాడును, జీవులచే కేకలు పెట్టించువాడును, పాదచారులను కాపాడు వాడును అగు రుద్రునకు నమస్కారము.

టీక : ఉచ్చైః = బిగ్గరగా, ఘోషాయ = శబ్దము చేయు వానికి, అక్రందయతే = పెద్దగా కేకలు పెట్టించువానికి, పత్తీనాం

= పాదచారులకు, పతయే = రక్షకుడయిన వానికి, నమః = నమస్కారము.

విశేషము : 1] ఉచ్చైర్ఘోషుడు : ఆకాశము శబ్దగుణకము, అందు రుద్రుడు అంతర్యామియై ఉండును. వర్షాకాలమున మేఘముగా, విద్యుత్తుగా వెలువడి పెద్ద శబ్దము పుట్టించును. దానివలన జీవుల హృదయములలో శబ్దస్వరూపుడయి మేల్కొంచును. ఒకరినొకరు శబ్దముతో పలుకరించు కొనుటకు ఇతడే ఆధారము.

2) ఆక్రన్దయతుడు : కేకలు పెట్టించువాడు లేక ఏడిపించువాడు. ఒకరి సంభాషణవలన నొకరు కష్టపడుట, నిష్ఠుర పడుట, కర్మలు పెంచుకొనుట వలన అనుభవించు ఫలితములు, తమ మానసిక ప్రవృత్తులుగా దుఃఖపడుట, దుఃఖపెట్టుకొను చుండుట జీవులు చేయుచుందురు. వారి కర్మ స్వరూపుడయి వారిచే స్వకర్మగా సాక్షాత్కరింపజేసికొని, వారిని కర్మఫలితములలో ఆడించు చుండువాడు.

3) ఓషధుల కధిపతి : ఊరుము ఉరిమిన తరువాత వర్షించి జీవులకు సస్యముల నిచ్చువాడు.

4) పాదచారులకు రక్షకుడు : జీవులు కోరిన చోటికి నడచి వెళ్ళుటకు వారికి పాదములను ప్రసాదించినవాడు. ఈ మంత్రమును ప్రయాణమునకు బయలుదేరుచు పఠింపగా సురక్షితమగును.

మంత్రము : నమః కృత్స్నవీతాయ ధావతే సత్త్వనామ్
పతయే నమః ॥

28

తా॥ సమస్త జీవులచే పరివేష్టింపబడిన పరివారము గల వాడును, పరుగెత్తుచున్న వాడును, సాత్త్వికులను రక్షించు వాడును అగు రుద్రునకు నమస్కారము.

టీక : కృత్స్నవీతాయ = సమస్త జీవులచే పరివేష్టింప బడిన వానికి, ధావతే = పరుగెత్తుచున్న వానికి, సత్త్వనాం = సత్త్వగుణము ప్రధానముగా కలవారికి, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : కృత్స్నవీతుడు : సమస్త జీవులును తనచుట్టు తిరుగుచుండు వాడు. అనగా తాను అదృశ్యుడై జీవులందరు వ్యక్తస్వరూపులై తిరుగుచుందురు.

2) ధావతే : పరుగెత్తువాడు. జీవులలో కదలికయొక్క స్వరూపము దేవుడు. ఆకాశమున వాయువుగా, జీవులలో మన స్సుగా, ఇంద్రియములుగా పరుగెత్తుచుండును. అణువులుగా దేహములను పరుగెత్తించు చుండును. ఇవన్నియు తనయందే పరుగెత్తుచున్నవి గనుక తాను స్థిరముగానే యుండును.

3) సత్త్వులకు పతి : రజస్తమస్సులను శమింప చేసి కొనుట యను దమము మంచి పనులు చేయుటవలనను, యోగము నభ్యసించి ధ్యానము నందుండుట వలనను సిద్ధిం చును. అట్టి వారికి నిత్యసుఖ స్వరూపమగు సత్త్వగుణము కలు గును. వారికి కోరిక లుండవు గనుక వారికి కావలసినవి సమ కూర్చ జేయుచు భగవంతుడే రక్షించుచుండును.

మంత్రము : నమస్సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమః ॥

29

తా॥ సహనశీలమైన స్వభావము గల రుద్రునకు నమస్కారము. నిశ్శేషముగా శత్రుసంహారము చేయువారి కధిపతియైన రుద్రునకు నమస్కారము: అన్ని దిక్కుల యందును శత్రువులు లేకుండ చేయువారిని పాలించు రుద్రునకు నమస్కారము.

టీక : సహమానాయ=సహించునట్టి వానికి [సమర్థునకు], నివ్యాధినే = మిగులకుండ కొట్టువానికి, అవ్యాధినీనాం = సర్వ దిక్కులందున ప్రహారము చేయునట్టి వానియొక్క, పతయే = పాలకునికి, నమః = నమస్కారము.

విశేషము : 1) సహమానుడు = సహించు స్వభావము కల వాడు లేక సామర్థ్యముతో మెలగువాడు.

2) నివ్యాధి = నిశ్శేషముగా వ్యథ చేయువాడు. ఇంద్రియములను, మనస్సును ఆవేశించు వ్యామోహాది శత్రువులను మిగులకుండ కొట్టగలవాడు.

3) అవ్యాధినులు = అన్ని దిక్కులయందు యుద్ధమున కొట్టగలవారు. అనగా ప్రతి భావము నందును సోకునట్టి పాప భావముల సేనలను దెబ్బకొట్టునట్టి జ్ఞాన కిరణము లను సేనలు.

మంత్రము : నమః కకుభాయ నిషఙ్గిణే స్తేనానాం పతయే నమః ।

30

తా॥ సంపదకును సౌందర్యమునకును శిఖరమూర్తియైన రుద్రునకు నమస్కారము. శాస్త్రమయమూర్తియైన రుద్రునకు నమస్కారము. ఒరలో నలంకరింపబడిన ఖడ్గము ధరించిన వానికి నమస్కారము. దొంగలను శిక్షించువాని కధిపతికి నమస్కారము.

టీక : కకుభాయ = 1) దిక్కుల నడుమ నున్నవాడు, 2) సౌందర్యమునకు, సంపదకు శిఖరమైనవాడు, 3) శాశ్త్రమయ స్వరూపుడు.

నిషఙ్గిణే = ఒరలోనున్న ఖడ్గము ధరించినవాడు,
స్తేనానాం = దొంగలను దమించు వారియొక్క,
పతయే = నాయకునకు,
నమః = నమస్కారము.

విశేషము : సర్వాంతర్యామియొక్క సగుణ స్వరూపమే రుద్రుడు. కనుక నతడు సృష్టిలోని నానారూపములుగా పూజింప దగినవాడు. 1) కకుభ స్వరూపుడు అనగా దిక్కుల నడుమ నున్న అంతర్యామి. చోటులో దిక్కుల విభాగము చేయునట్టి ప్రజ్ఞ అతని స్వరూపము. కకుభ మనగా సౌందర్యము, సంపద, శిఖరము, శాస్త్రతత్త్వము అనిగూఢ అర్థము. ఈ పదమునకు మద్దిచెట్టు అను సామాన్యార్థము సందర్భమును బట్టి అప్రస్తుతము. 2) స్తేనులు అనగా దొంగలని సామాన్యార్థము. దొంగలను పట్టువారు, దమించువారు అని విశేషార్థము. ఇటుపైన తస్కరపదము వేరుగా వాడబడినది గనుక స్తేన శబ్దమునకు దొంగలను దమించువాడను నర్థమే సరియగును.

మంత్రము : నమో నిషఙ్గిణ ఇషుధిమతే తస్కరాణాం
34 పతయే నమః ॥

తా॥ బాణము నెక్కుపెట్టుటకు వింటిని చేత ధరించిన రుద్రునకు నమస్కారము. అమ్ములపొదిని మూపున ధరించిన

వానికి నమస్కారము. అడవులలో దారులుకాచి కొల్లగొట్టు దొంగల కధిపతియైన రుద్రునకు నమస్కారము.

టీక : నిషఙ్గిణే = అమ్ము నెక్కుపెట్టుటకు చేత ధరించిన విల్లు నిషఙ్గ మనఁబడును. దానిని ధరించిన వానికి (నమస్కారము), ఇషుధిమతే = అమ్ములపొది ధరించినవానికి, తస్కరాణాం = కొల్ల గొట్టు దొంగలయొక్క, పతయే = అధిపతియైన నాయకునకు, నమః = నమస్కారము.

విశేషము : ప్రపంచమున మంచివారిలోనేగాక మనము చెడ్డవారని యనుకొను వారిలోగూడ దేవుడున్నాడు. అత డంత ర్యామి గనుక సర్వమునం దున్నాడు. దుష్టసర్పములు, క్రిమి కీటకాదులలోగూడ నతడున్నాడు. దారులుగొట్టు దొంగలు మొద లగు పాపవృత్తి జీవనముగల వారియందు గూడ మానవుడుగ దేవుడుండి కాలక్రమమున తన్ను తాను తెలిసికొను వాడుగా పరిణామము చెందుటకు జన్మలెత్తుచున్నాడు. అది భగవంతునకు క్రీడ. కనుకనే పూర్వకర్మకు బద్ధులై వర్తించుచు తమ తమ స్థితు లలో జన్మలెత్తుచు జీవులు క్రమముగ వైరాగ్య సంపన్నులై ముముక్షువు లగుచున్నారు. కర్మబద్ధులలో నొకరికొకరు దొంగ లుగా నుందురుగాని ఎవరికి వారు దొంగలు కారు. కొల్లగొట్టబడి నష్టపోవలసిన దుష్కర్మ కలవారిని వారు కొల్లగొట్టగలరు గాని ఎవరూ నితరులను కొల్లగొట్టలేరు.

మంత్రము : నమో వఞ్చతే పరివఞ్చతే
32 స్తాయూనాం పతయే నమః ॥

తా॥ వంచన (మోసము) చేయువాడును, వానిని వంచన చేయువాడును అను రూపములుగా గల రుద్రునకు నమస్కారము. రహస్య స్థలములలో దాగియున్న దొంగల రూపమునను, వారిని కనిపెట్టి పట్టుకొనువాని రూపమునను ఉన్న రుద్రునకు నమస్కారము.

టీక : వఞ్చతే = వంచన చేయువానికి, పరివఞ్చతే = వంచనపై వంచన చేయువానికి, స్తాయూనాం = రహస్యస్థానములలో నున్న దొంగలకు, పతయే = అధిపతికి మరియు నాజ్ఞ పెట్టువానికి, నమః = నమస్కారము.

విశేషము : జీవుల సృష్టిలో అధర్మమునకు వంచనకు నుత్పత్తి స్థానము ఇంద్రియములకు మనస్సునకు సంబంధించినది. బుద్ధికి ఆత్మకు సంబంధించినది ధర్మమునకు స్థానము. ఈ రెండును సృష్టియందు వర్తించును గనుక రెండును రుద్ర రూపములే. అందు మొదటి దానివలన ధర్మము దెబ్బతినుటయు, రెండవ దానివలన ధర్మము స్థాపింపబడుటయు భగవంతునియొక్క లీలలు. అందు వంచనకు ప్రతివంచన దొంగలను కనిపెట్టుట, పట్టుకొనుట, శిక్షించుట మున్నగువాని కావశ్యకము. మరియు పూర్వ దుష్కర్మ ఫలితముగ దొంగిలింపబడుట, మోసము చేయబడుట, నష్టపోవుటయు శిక్షలుగ ననుభవింపబడును. దానిని నిర్వహించుటకు మోసకాంద్ర రూపమునను, వారిని దమించుటకు అధికారుల రూపమునను వర్తించుచున్న రుద్రునకు నమస్కారము.

మంత్రము : నమో నిచేరవే పరిచరాయారణ్యానాం
పతయే నమః ।

33

తా॥ ఇంటిదొంగ రూపమునను, వానిని కనిపెట్టునట్టివాని ఇంటిదొంగ రూపమునను, వేచియుండునట్టి వారి రూపములు గల రుద్రునకు నమస్కారము. నలుదిక్కుల చరించుచు దొంగ తనమున కెక్కడ అవకాశము చిక్కునోయని తిరుగునట్టి వాడును, వానిని కనిపెట్టునట్టివాడును అగు రూపములు ధరించిన రుద్రునకు నమస్కారము. అడవులవెంట బోవువారిని దారులుకాచి కొట్టువాడును, వానిని పట్టువాడును అగు రూపములు ధరించిన రుద్రునకు నమస్కారము.

టీక : నిచేరవే = చరింపకుండ ఒకేతావున నుండి కనిపెట్టువానికి, పరిచరాయ = చుట్టుపట్టులయందు చరించువానికి, అరణ్యానాం = అడవులకు, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1) తిరుగకుండ నొకచోట కనిపెట్టుకొని పరిశీలించువాడు నిచేరువు అనబడును. అతడు దొంగ కావచ్చును, దొంగను పట్టువాడు కావచ్చును. ఇద్దరిలో నంతర్యామిగ నుండి జీవుల కర్మఫలములు సంక్రమింప చేయువాడు రుద్రుడు. అదివరకు దొంగతనము చేసిన వానికి దొంగగను, మంచివానికి దొంగలను పట్టువాడుగను రుద్రు డందుబాటులో నుండును.

2) నగరమున అంగడులు మొదలగు తావులందు తిరుగుచు కనిపెట్టువారు పరిచరులు.

3) అడవులయందు చరించువారిపై దృష్టిపెట్టి యుండువాడు అరణ్యకుల పతి. వీరు దొంగలు కావచ్చును, దొంగలను పట్టువారు కావచ్చును. ఇన్ని రూపములలో ప్రత్యక్షమగుచున్న రుద్రునకు నమస్కారము.

మంత్రము : నమస్సృకావిభ్యో జిఘాగ్ంసద్భ్యో
34 ముష్ణతాం పతయే నమః ।

తా॥ ఆయుధములు ధరించి దేహములను రక్షించు రుద్ర రూపులకు నమస్కారము. శత్రువులను చంపగోరునట్టి రుద్రులకు నమస్కారము. ధాన్యాదులను దొంగిలించునట్టి దొంగల నాయకులకు, వారిని అజ్ఞాపించి దమించువారికిని నమస్కారము.

టీక : సృక, అవిభ్యః=వజ్రము మొదలగు నాయుధములచే శరీర రక్షణము చేయువారికి, జిఘాంసద్భ్యః=చంపగోరినవారికి, ముష్ణతాం = దొంగిలించు వారియొక్క, పతయే= అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1) సృక మనగా వజ్రాయుధము. దృఢమైన ఏ ఆయుధమైనను దీనివలన తెలియబడును.

2) జిఘాంసుః=చంపగోరినవాడు. ఇచ్చట హత్యలు చేయువాడును, వానిని శిక్షించు వాడును అని అర్థము.

3) ముష్ణతా=అనగా మోసముచేసి దొంగిలించుట. ఇచ్చట దొంగిలించువారి నాయకులును, వారినిపట్టి శిక్షించువారును అని అర్థము.

మంత్రము : నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః
35 ప్రకృన్తానాం పతయే నమః ।

తా॥ ఖడ్గములు ధరించిన రుద్రమూర్తులకు నమస్కారము. రాత్రులయందు తిరుగుచు దొంగలవలన మమ్ము రక్షించు రుద్ర

మూర్తులకు నమస్కారము. అపరాధుల కంఠములను కత్తిరించి శిక్షించువారి పై అధికారులకు నమస్కారము.

టీక : అసిమద్భ్యః = కత్తులు ధరించువారికి, నక్తఞ్చరద్భ్యః = రాత్రులయందు తిరుగువారికి, ప్రకృన్తానాం = కంఠములు కత్తిరించువారియొక్క, పతయే = అధిపతికి, నమః = నమస్కారము.

విశేషము : 1) ఖడ్గములు ధరించువారు : వీరు మార్గ మందలి బాటసారులను రక్షించునట్టి అధికారులు. 2) రాత్రుల యందు చరించువారు అనగా రాత్రులయందు రక్షించు కావలా దారులు. 3) కత్తిరించువారు అనగా హత్యలు, దోపిడీలు చేయు వారిని శిరచ్ఛేదము చేయు నధికారము గలవారు. వీరందరిలో పనిచేయునట్టి సంకల్ప స్వరూపుడు భగవంతుడైన రుద్రుడే. అతడు ప్రభుత్వ శక్తియను రూపమున రక్షణ చేయుచుండును. అట్టి రూపములను స్మరించి నమస్కరించు వారికి పౌర ధర్మ ముల రూపమున రక్షణాత్మకుడైన భగవంతుడు ధర్మస్వరూ పుడై కర్మయోగము మూలమున భక్తియోగమును ప్రసాదించు చుండును.

మంత్రము : నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం
పతయే నమః ।

తా॥ చక్కని తలపాగ ధరించువాడును, పర్వతముల యందు చరించువాడును, పంట భూమియందు పంటను కోతకోసి కుప్పలు వైచువారి కధిపతియు నగు రుద్రునకు నమస్కారము.

టీక : ఉష్ణీషిణే = తలపాగ గలవానికి, గిరిచరాయ = పర్వతముల యందు చరించువానికి, కు + లుఞ్చానాం = భూమిపై కోత కోయువారికి, పతయే = అధిపతి యగువానికి, నమః = నమస్కారము.

విశేషము : తలపాగ ధరించువా డనగా నాయకుడు. ఒక పర్వత ప్రాంతమందలి వారిపై నధికారముగల పరిపాలకుడైన కొండజాతివాడు.

2) గిరిచరు డనగా పర్వతముల యందు చరించువాడు. ఇతడు కోయల, చెంచుల నాయకుడు కావచ్చును. తపస్సు చేయుచున్న అర్జుననకు పాశుపతము నిచ్చుటకు రుద్రుడు ప్రత్యక్షమైనది యీ రూపముననే.

3) కులుంచకులు అనగా భూమిపై నున్న మొక్కలను కోయువారు. పంటకు వచ్చిన పొలములను కోసి కుప్పలు వైచువారని యర్థము.

మంత్రము : నమ ఇషుమద్భ్యోధన్వా విభ్యశ్చవో నమః ।
37 నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చవో నమః ॥

తా॥ ఓ రుద్రమూర్తులారా! అమ్ములను ధరించి, ధనుస్సులను ధరించిన మీ మూర్తులకు నమస్కారము. సుదీర్ఘముగా ధనుస్సుల నెక్కుపెట్టువారును, అమ్ములను శత్రువుల వైపునకు గురిపెట్టి నిలుచువారును అగు రుద్రులకు నమస్కారము.

టీక : ఇషుమద్భ్యః = బాణములు గలవారు, ధన్వానిభ్యః=ధనుస్సులు గలవారు, ఆతన్వానేభ్యః = బాగుగా విస్తరింపజేయువారు [అల్లెత్రాడు గట్టిగా లాగి ధనుస్సును పెద్దది చేసి పట్టువారు], చ = మరియు, ప్రతిదధానేభ్యః = ప్రతిఘటించి ధరించినవారు [శత్రువుల నెదిరించి విల్లమ్ములు దాల్చిన వారు అగు], వః = మీకు, నమః = నమస్కారము.

మంత్రము : నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చవో నమః॥
38

తా॥ పరిపూర్ణముగా పుష్కలముగా దానము చేయుచున్న వారికి నమస్కారము. తమ విలువగల వస్తువులను ఇతరులకై విడిచిపెట్టుచున్న వారికి నమస్కారము.

టీక : నమః + ఆయచ్ఛద్భ్యః = పూర్తిగా నిచ్చుచున్న వారికి నమస్కారము, చ = మరిము, విసృజద్భ్యః, నమః = విడిచిపెట్టుచున్న వారికి నమస్కారము.

విశేషము : ఇందు దానబుద్ధి, వైరాగ్యబుద్ధి కలవారు లోకోపకారులైన రుద్రరూపులుగా చెప్పబడిరి.

మంత్రము : నమోఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చవో నమః।
39 నమ ఆసీనేభ్య శ్శయానేభ్యశ్చవో నమః॥

తా॥ బాణము నెక్కుపెట్టుచున్న వారును, అమ్ములను గ్రుచ్చుకొనునట్లు ప్రయోగించువారును అగు మీకు నమస్కారము. కూర్చుండిన వారును, పరుండిన వారును అగు మీకు నమస్కారము.

**టీక :** అస్యద్భ్యః = అమ్ములను వేయువారికొరకు, చ = మరియు, విధ్యద్భ్యః = ఛేదచేయుచున్న వారికొరకు [గ్రుచ్చుచున్నవారికొరకు], ఆసీనేభ్యః = కూర్చుండిన వారికొరకు, చ = మరియు, శయానేభ్యః = శయనించిన వారికొరకు, వః = మీకొరకు, నమః = నమస్కారము.

**విశేషము : 1)** జీవులాచరించు పనులకు ఫలితములుగా రుద్రుని అమ్ము లెక్కపెట్టబడును. చెడ్డపనుల ఫలితములుగా వ్యాధి, మృత్యువు మున్నగు దోషములు దేహమునకు గురిపెట్టబడి, గ్రుచ్చబడి, బాధించి, జీవునకు సంయమమును నేర్పును.

2) దేహమునందు జీవుడు జన్మ మెత్తుటయే కూర్చుండియుండుట. దేహమును విడుచుటయే పండుకొనుట. జనన, మరణముల మార్గమున జీవుల రూపములుగా నటించు రుద్రునకు నమస్కారమని తాత్పర్యము.

మంత్రము : నమ స్స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమః ।
40 నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః ॥

**తా॥** నిద్రించుచున్నట్టి, మేల్కాంచుచున్నట్టి, నిలుచుండినట్టి, పరుగెత్తుచున్నట్టి రుద్రమూర్తులగు మీకు నమస్కారము.

**టీక :** స్వపద్భ్యః = నిద్రించుచున్న వారికి, జాగ్రద్భ్యః = మేల్కాంచుచున్న వారికి, తిష్ఠద్భ్యః = నిలుచున్న వారికి, ధావద్భ్యః = పరుగెత్తు చున్నవారికి, వః = మీకు, నమః = నమస్కారము.

విశేషము : నిద్రించుట, మేల్కాంచుట మనస్సునకు సంబంధించిన లక్షణములు లేక చిత్తవృత్తులు. నిల్చుండుట, పరుగెత్తుట యనునవి దేహమునకు సంబంధించిన వృత్తులు. వీని సంకల్పములు మనస్సుననే పుట్టి వర్తించును. ఆత్మలకు వర్తింపవు. ఐనను, క్రీడార్థముగా లోకధర్మములు వర్తించుటకు మనస్సు, శరీరము రూపమున ఆత్మయే దిగివచ్చును. రుద్రమూర్తియైన యాత్మస్వరూపుని నుండి మనస్సు, దేహములు దిగివచ్చుచుండును. ఇట్టి వైభవములతో గూడిన రుద్రమూర్తులకు నమస్కారము.

మంత్రము : నమస్సభాభ్య స్సభాపతిభ్యశ్చవో నమః।
41 నమో అశ్వేభ్యో అశ్వపతిభ్యశ్చవో నమః॥

తా॥ సభల స్వరూపమున, సభాపతుల స్వరూపమున వ్యక్తమగు రుద్రుని రూపములైన మీకు నమస్కారము. అశ్వముల రూపమునను, అశ్వపతుల రూపమునను ప్రత్యక్షమగు మీకు నమస్కారము.

టీక : సభాభ్యః = సభలకు, సభాపతిభ్యః = సభల కధిపతులగు వారికి, వః = మీకు, నమః = నమస్కారము, అశ్వేభ్యః = గుఱ్ఱములకు, అశ్వపతిభ్యః + చ = మరియును అశ్వముల కధిపతులకు, వః = మీకు, నమః = నమస్కారము.

విశేషము : 1) పెద్దల సభలో చేరిన వ్యక్తులందరితో సభ యనబడు సమాహార చైతన్య స్వరూప మేర్పడును. దానివలన సభలో పాల్గొను వారికి, జ్ఞానము వికసించును గనుక రుద్రుడే సమాహార చైతన్య స్వరూపము. సభను నిర్వహించువాడు

సృష్టికి బ్రహ్మవంటివాడు. యజ్ఞమున పెద్దలందరు సభగా చేరు చుందురు. దానిని సదస్సు అందురు. అందలి ప్రసంగములను సమన్వయించి నిర్వహించువాడు సభాపతి.

2) అశ్వము ప్రాణస్పందనమునకు రూపము తొడిగిన సంకేతము. శరీరమున ప్రాణమయకోశము వలన మానవుడు శరీరముతో నడచుచున్నాడు. కనుక శరీరధారిని గుఱ్ఱముపై స్వారిచేయు రౌతుగా వేదము పేర్కొనును. అతడే అశ్వపతి.

3) అ + శ్వః అనగా రేపు లేనివాడు, రేక దాచుకొనుట యెరుగని నిత్యనూతనుడైన ఆత్మస్వరూపుడు. వానికి పతియైన వాడు ఆత్మల కాధారుడైన ఈశ్వరుడు. వీరందరును రుద్ర రూపులుగా నమస్కరింపబడు చున్నారు.

మంత్రము : నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యంతీభ్యశ్చవో నమః ।
42 నమ ఉగణాభ్యస్తృగ్ంహతీభ్యశ్చవో నమః ॥

తా॥ అన్ని దిక్కులకును వ్యాపించి కొట్టగల శక్తి స్వరూప ములగు రుద్రులకు నమస్కారము. విశేష స్థానములలో కొట్టగల శక్తులకు నమస్కారము. ఉన్నతములైన శక్తిగణములకు నమస్కారము. త్రుంపగల శక్తి స్వరూపములకు నమస్కారము.

టీక : ఆవ్యాధినీభ్యః = అన్ని దిక్కుల వేటాడు స్త్రీల స్వరూపములకు, వివిధ్యంతీభ్యః = ప్రత్యేక స్థానములందు కొట్ట గల స్త్రీ స్వరూపములకు, ఉగణాభ్యః = ఉన్నత గణములుగా నేర్పడిన స్త్రీలకు, తృగ్ంహతీభ్యః = త్రుంపగల శక్తిస్వరూప ములకు, వః = మీకు, నమః = నమస్కారము.

విశేషము : వేదమున మంత్రములలో స్త్రీలింగ శబ్దము అన్నియు శక్తులను సూచించును. పులింగ శబ్దము లన్నియు ప్రజ్ఞలను సూచించును. ఈ విధముగా శబ్దములయందు లీనమై ఉచ్చారణమున వెలువడు దేవతలు దంపతులు దంపతులుగా నేర్పడుదురు. కనుకనే రుద్రులందరు శివశక్తుల జంటలు.

2) అవ్యాధిని అనగా అన్ని దిక్కులకు కొట్టగల వ్యాధస్త్రీ లేక బోయ వేటకత్తె. వివిధ్యంతి అనగా గురిచూసి ప్రత్యేక స్థానములలో కొట్టగల వేటకత్తె. ఇందు మొదటిది పంచభూతముల లోని శక్తి. రెండవది జీవులలోని శక్తి.

3) ఉగణ యనగా ఉత్తమ గణముల నేర్పరచు శక్తి. ఇది మనలో ఉకారము నుచ్చరించు ప్రయత్నమున పుట్టును. 'ఉమ' యని పిలువబడును. ఈమె వైరాగ్యము నిచ్చు శక్తి. కనుకనే పురాణములలో అలంకారములను తొలగించు ఈశ్వరునికై తపస్సు చేయుచున్నట్లు వర్ణింపబడెను. తృహంతియనగా త్రుంపునట్టి శక్తి. రాక్షస గణములను త్రుంపునట్టి యోగశక్తి. ఈమెనే దుర్గ, మహిషాసురమర్దిని యందురు. ఈ రూపము లన్నియు జగదంబిక అవతారములు. ఆమె యతని ప్రకృతి కనుక ఆమె రూపములు రుద్రుని రూపములుగనే చెప్పబడినవి.

మంత్రము : నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమః ।
43 నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమః ॥

తా॥ అశల రూపములనున్న రుద్రులకు నమస్కారము. ఆశయములు గలవారి రూపములకు నమస్కారము. అనేక జాతులుగా గుంపు లేర్పడు రూపములకు నమస్కారము. గుంపుల కధిపతుల రూపములకు నమస్కారము.

టీక : గృత్సేభ్యః=ఆశయముల కొరకు, గృత్సపతిభ్యః + చ = మరియు ఆశయములు కలవారి కొరకు, వ్రాతేభ్యః = సమూహముల కొరకు, వ్రాతపతిభ్యః + చ = మరియు సమూహముల కధిపతుల కొరకు, వః = మీ కొరకు, నమః = నమస్కారము.

విశేషము : 1) ఆశలు గలవారు విషయాసక్తులు, ఆశయములు గలవారు బలవత్తరములైన పవిత్ర విషయములయందాసక్తులు. ఇందరును బద్ధులైన సంసార జీవులు. వారి రూపములలో కనుపించి, రుద్రుడు పరస్పరము మోహింపజేసి, జగన్నాటకముగా తాండవించు చున్నాడు.

2) జీవుడు జీవులను వివిధ జాతులుగా తెలిసికొను చున్నాడు. నరుడు నరులను కూడ వివిధ జాతులుగా తెలిసికొను చున్నాడు. గుంపులుగా నేర్పడి, ఒక్కొక్క గుంపునకు ఒక్కొక్క నాయకుడుగా మెలగుచున్నాడు. ఇన్నియు రుద్రుని రూపములే.

మంత్రము : నమో గణేభ్యో గణపతిభ్యశ్చవో నమః ।
24 నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చవో నమః॥

తా॥ రుద్రగణముల మూర్తులు, ఆ గణములకు నధిపతులగు మూర్తులు అగు మీకు నమస్కారము. వివిధ రూపములు గలిగి విశ్వముయొక్క రూపము ధరించిన మీకు నమస్కారము.

టీక : గణేభ్యః = గుంపుల కొరకు, చ = మరియు, గణపతిభ్యః = గుంపుల కధిపతుల కొరకు, వః = అట్టి మీకు, నమః = నమస్కారము, విరూపేభ్యః = వివిధ రూపములు గలవారి కొరకు, చ = మరియు, విశ్వరూపేభ్యః = ఈ సృష్టియొక్క రూపములు గలవారి కొరకు, వః = మీకొరకు, నమః = నమస్కారము.

విశేషము : 1) గణము లనగా - రుద్రలోక మండలి స్పందనాత్మకములయిన చైతన్యముల గణములు. వీరు పంచ భూతముల గుంపులుగను, వీరితో నేర్పడు నింద్రియాదుల శక్తుల రూపములుగను తిరుగుచుందురు. కనుక భూతగణములని పిలువబడుదురు. దేహములందు జీవుల మనసులను కర్మఫల ముల ననుసరించి మథనము చేయుచుందురు. కనుక ప్రమథ గణములని పేరు.

2) ఈ గణముల కధిపతులే గణపతులు. వారు ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మకము అయిన ఉచ్చారణ రూపములుగ నుందురు. కనుక శబ్దగణములకు, వాగ్గణములకు, సర్వ విద్యలకు అధిపతులు. వీరి ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మకమైన మార్గమే తొండముగ రూపకల్పనము చేయుబడి గజాననులుగ నారాధింపబడుదురు. శ్వాసకు మూలము ఓంకారము గనుక వీరు ప్రణవముయొక్క బాహ్య స్వరూపులు.

3) విరూపు లనగా వివిధములైన రూపములు గలవారు. కనుకనే వికృతములయిన రూపములు, విశిష్టములైన మంచి రూపములు ధరించినవారి మొత్తమని కూడ ఈ పదమున కర్థము.

4) విశ్వరూపులు అనగా విశ్వమండలి వివిధ సృష్టి రూపములు ధరించినవారు. వీరందరిలో నంతర్యామి అయిన పరమేశ్వరుడే ఈ విశ్వరూపమును ధరించి యుండును.

మంత్రము : నమో॒ మహద్భ్య॑ః క్షుల్ల॒కేభ్య॑శ్చ వో॒ నమః॑ ।
44 నమో॒ రథిభ్యో॑ ఽర॒థేభ్య॑శ్చ వో॒ నమః॑ ॥

తా॥ మహిమలు గల మహానుభావుల రూపములతోను మహిమలు లేని అల్పుల రూపములతోను చరించుచున్న రుద్ర మూర్తులకు నమస్కారము. రథములెక్కి చరించువారికిని, రథములు లేక చరించువారికిని నమస్కారము.

టీక : మహద్భ్యః = గొప్పవారి కొరకు, చ = మరియు, క్షుల్లకేభ్యః = అల్పుల కొరకు, రథిభ్యః = రథములు గలవారి కొరకు, అరథేభ్యః = రథములు లేనివారి కొరకు అగు, వః = మీ కొరకు, నమః = నమస్కారము.

విశేషము : మహాత్ములు అనగా గొప్పవారు, మహిమలు గల వారును. కొందరు సంపదలు, కొందరు తెలివి, కొందరు విద్య, కొందరు యోగమూలకములైన అణిమాది మహాసిద్ధులు గలవారు. క్షుల్లకులు అనగా అల్పులు. సంపదలు మున్నగు వానిచేత అల్పులు, మరియు బుద్ధి, వివేకము, నీతిలేని సంకుచిత స్వభావము కలవారు కూడ. ఇందరును ఒకరికొకరు కర్మఫలముల అనుభూతికొరకు సంప్రాప్తమగుచుందురు. కనుక వీరి మొత్తము రుద్రమూర్తులే యని తెలిసి నమస్కారభావము వహించినచో కర్మ విమోచనము కలుగును.

రథములు కలవారు, లేనివారు అనగా ప్రభువులు మొదలు పేదల వరకు సంపన్నులు, సామాన్యులు అందరు రుద్రుని మూర్తులే. మరియు రథములు అనగా దేహములని తత్త్వశాస్త్ర సంకేతము. దేహములలో నున్నవారు, దేహములు విడిచిన వారు, దేహములు లేకుండ చరించు దేవతలు మున్నగువారందరు రుద్రుని రూపములే అని ధ్యానింపవలెను.

మంత్రము : నమో రథేభ్యః రథపతిభ్యశ్చవో నమో
46 నమస్సేనాభ్యస్సేనానిభ్యశ్చవో । నమో
నమః క్షత్తృభ్యస్సంగ్రహీతృభ్యశ్చవో నమః ॥

తా॥ రథముల, రథపతుల రూపులైన రుద్రులకును, సేనల రూపులు సేనానుల రూపులునగు రుద్రులకు నమస్కారము. గాయ పడకుండ రక్షించువారును, జీవులను పరిపాలనా విధానములోనికి కూర్పు చేయువారును నగు రుద్రులకు నమస్కారము.

టీక : రథేభ్యః = రథరూపులకు, రథపతిభ్యః + చ = రథపతుల కొరకు, మరియు సేనాభ్యః + చ = సేనలకు, మరియు సేనానిభ్యః + చ = సేనానుల కొరకు, మరియు క్షత్తృభ్యః + చ + క్షతమునుండి రక్షించువారి కొరకు, మరియు సంగ్రహీతృభ్యః, = చ = సంగ్రహణము చేయువారి కొరకు, వః = మీ కొరకు, నమః = నమస్కారము.

విశేషము : 1) రథపతి యనగా సేనానాయకుల పదవులలో నొకటి. యుద్ధాదులందు ఒక సంఖ్యగల రథములకు బాధ్యుడుగా నడిపించువాడు. 2) సేనలు అనగా యోధుల దళములు. 3) సేనానులు అనగా నొక చిన్న దళమున కధిపతులు. 4) క్షత్త యనగా శత్రువును గాయపరచువాడు. తన పక్షమును గాయ పడకుండునట్లు రక్షించువాడు, అంగరక్షకుడని యర్థము. 5) సంగ్రహిత యనగా సేనలను లెక్కల ప్రకారము దళములుగా కూర్చువాడు.

ఈ పదములన్నియు రుద్రుని రూపముల నుద్దేశించినవి గనుక విశేషార్థ ద్యోతకములు. రథమనగా శరీరము. రథః

యనగా జీవుడు. సేన యనగా దేహమున పనిచేయు దేవాది గణము. సేనాని యనగా వానిలో నొక్కొక్క గణమున కధిపతి. వీరు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగువారు. క్షత్తృడు అనగా అంగరక్షకుడు, దేహమును రక్షించు సప్తధాతువులు మొదలగు రూపములవాడు. సంగ్రహీత యనగా వీరిని కూర్చువాడు లేక ప్రాణము. వీరందరును రుద్రరూపులుగా నమస్కరింప బడుచున్నారు.

మంత్రము : నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః ।
47 నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమః ॥

తా॥ చెక్కతో శిల్పముచేయు వడ్రంగులకు, రథములు చేయువారి రూపముననున్న రుద్రమూర్తులకు నమస్కారము. కుమ్మరులు, కమ్మరులు మొదలగు రూపములతో చరించుచున్న రుద్రమూర్తులకు నమస్కారము.

టీక : తక్షభ్యః = చెక్కపై శిల్పము జేయువారి కొఱకు, రథకారేభ్యః = రథములు తయారుచేయువారి కొఱకు, చ = మరియు, కులాలేభ్యః = కుమ్మరుల కొఱకు, కర్మారేభ్యః = కమ్మరుల కొఱకు, నమః = నమస్కారము.

విశేషము : 1) తక్షణము అనగా చెక్కపై శిల్పము చేయుట, తక్షకుడనగా వడ్రంగి. రథకారుడనగా రథములు చేయు వడ్రంగి.

2) ఇందు వివిధ వృత్తులకు సంబంధించినవారు వస్తువుల సృష్టికి కారణమగుచున్నారు. గనుక రుద్రుని రూపములుగా

చెప్పబడిరి. మరియు సృష్టిలో భగవంతుడు జీవులుగా దిగి వచ్చినపుడు మొదట వృక్షములను సృష్టించుచు, వాని దేహ ధాతువులగు కొయ్యపదార్థములను నిర్మించి చెట్లరూపములు గలిగించును. అటుపైన జంతువుల దేహములను రథములవలె నిర్మాణము చేయును. శరీరము జీవికి రథము వంటిది. శరీరముల లోని ధాతువుల కొరకు మట్టిలోని ఖనిజములను, రసాయనిక పదార్థములను స్వీకరించును. ఇట్లు మట్టితో రూపములు చేయును గనుక కుమ్మరివాడు. ఆ ఖనిజములలో లోహములను కూడ భూమియందు పుట్టించి మన దేహధాతువులుగా నిర్మించును. ఇట్లు లోహములతో పనిచేసి దేహములను అదుకులు పెట్టును గనుక కమ్మరపు పనివాడుగా దేవుడు వర్ణింపబడెను.

మంత్రము : నమః పుంజిష్ఠేభ్యో నిషాదేభ్యశ్చవో నమః ।
48 నమ ఇషుకృద్భ్యో ధన్వాకృద్భ్యశ్చవో నమః॥

తా॥ గణములుగా జనుల నేర్పరచునట్టి రుద్రమూర్తులకు, నిషాదుల రూపమున చరించువారికి నమస్కారము. అమ్ములు చెక్కువారికిని, ధనుస్సులు తయారుచేయు వారికిని నా నమస్కారము.

టీక : పుంజిష్ఠేభ్యః = పుంజములు పుంజములుగా నేర్పరచిన జనసంపద కలవారి కొరకు, నిషాదేభ్యః = నిషాదులను పేరుగల వనచరుల కొరకు, ఇషుకృద్భ్యః = అమ్ములను తయారు చేయువారి కొరకు, ధన్వకృద్భ్యః = ధనుస్సులను తయారుచేయు వారి కొరకు, (ఇషుకృద్భ్యః = అమ్ములు ప్రయోగించువారిని తయారుచేయువారి కొరకు, ధన్వకృద్భ్యః = ధనుర్ధారులను తయారుచేయువారి కొరకు, నమః = నమస్కారము.

విశేషము : 1) పుంజము అనగా గుంపులు. వర్గీకరణము చేయుబడిన నరసృష్టి. దేశములు, రాష్ట్రములు, జాతులు, వర్ణాశ్రమములు మున్నగువాని కధిపతి యని యర్థము.

2) నిషీదము అనగా లయమగుట, చనిపోవుట. నిషాదుడనగా చంపువాడు, వేటగాడు. దేహధారుల లయమునకు రుద్రు డధిపతి. కనుక నిషాదుడు.

3) బాణములు ఇంద్రియములకు, సూర్యరశ్ములకు నుప లక్షకములు వానిని చెక్కువాడు అనగా మనోరూపుడు, సూర్యతేజోరూపుడు అని యర్థము. పూర్వము రుద్రుడు, తామ్రుడు, బభ్రుడు, అరుణుడు అని వర్ణింపబడినదాని కిది యనుబంధము.

4) ధనుస్సు అనగా సంకల్పము, ప్రణవము అని వేదకవి సమయము. ధనుర్ధారి యనగా ప్రణవము నెరిగినవాడు, సంకల్పించువాడు జీవులకు తారకమంత్ర ముపదేశించి ధనుర్ధారులుగా తయారు చేయువాడు రుద్రుడని భావము.

మంత్రము : నమో మృగయుభ్య శ్శ్వనిభ్యశ్చ వో నమః ।
49 నమశ్శ్వభ్య శ్శ్వపతిభ్యశ్చ వో నమః ॥

తా॥ మృగములను వేటాడువారు, వేటకుక్కలు, ఆ కుక్కలను పెంచువారు మున్నగు రూపములలో నున్న రుద్రమూర్తులకు నమస్కారము.

టీక : మృగయుభ్యః = జంతువులను వేటాడువారి కొరకు, శ్వనిభ్యః = కుక్కలు గలవారి కొరకు, శ్వభ్యః = కుక్కల కొరకు,

శ్వపతిభ్యః + చ = మరియు కుక్కల గుంపులకు అధిపత్యము వహించు వారికొరకు, నమః = నమస్కారము.

విశేషము : కుక్కలు లౌకిక దృష్టిలో విశ్వాసమునకు చిహ్నములు. సాధకుని దృష్టిలో ఏమరుపాటు లేక చీకటిలోని రహస్యముల యెడల మేల్కొనియుండు ప్రజ్ఞలకు చిహ్నములు. కనుకనే తంత్ర గ్రంథములలో వీనిని క్షేత్రపాలకులు [దేహమును పరిపాలించునట్టి సదాచార రూపమైన శక్తులు], భైరవములు [అంతశ్శత్రువుల యెడల భీకరమైన శబ్దము చేయునవి], పాతాళశక్తులు [అంతర్యమైన రహస్య ప్రజ్ఞయందు పనిచేయునవి]గా నారాధింపబడును. అధ్యాత్మిక సాధకుడు కుక్కను, కుక్క మాంసము తినువానిని కూడ భౌతిక దృష్టితో చూడక, ఏనుగును, గోవును, బ్రాహ్మణుని చూచునట్లే అంతర్లీనమైన విగ్రయోగ శక్తి యొక్క వ్రత్యేకత రూపమున గమనింపవలెనని భగవద్గీత చెప్పుచున్నది. అట్లు చూచుటయే జీవస్వరూపుడు, సగుణమూర్తి యగు రుద్రరూప పరబ్రహ్మమును చూచుట.

ఆకాశమున కనిపించు తారకల గుంపులో కుక్క యాకారమొకటి కలదు. అందలి తారకలనుండి సకల జీవధర్మములను ప్రతిపాదించు వెలుగు మనపైకి ప్రసరించునని తారకాశాస్త్రము చెప్పుచున్నది. దానిని బట్టియే ధర్మస్వరూపమగు యమము యముడుగా కుక్కరూపమున ధర్మరాజు వెంట నడచెనని మహాభారతము చెప్పుచున్నది. ఇట్టి తారకల వెలుగులును, వాని కధిపతులును నగు రుద్రమూర్తులకు నమస్కారమని ఇందలి వేదవాఙ్మయ కవి సమయము. యోగమున కధిదైవతమగు దత్తమూర్తి వెంట నాలుగు వేదములును కుక్కలుగా తిరుగుట గమనింపదగినది.

మంత్రము : నమో భవాయచ రుద్రాయచ నమశ్శర్వాయచ
పశుపతయేచ నమో నీలగ్రీవాయచ ।

తా॥ సృష్టియందు ఉద్భవించు స్వరూపములు గల రుద్రునకు నమస్కారము. శరములను ప్రయోగించువానికి, పశువులైన ఇంద్రియముల కధిపతికి నమస్కారము. మరియు నల్లని మెడ గల వానికి నమస్కారము.

టీక : భవాయ = ఉద్భవస్వరూపుడు, సంసార స్వరూపుడు అగు వానికి, రుద్రాయ = రోదసి యనబడు అంతరిక్షమున కధిపతికి, శర్వాయ = శరములను ప్రయోగించువానికి, పశుపతయే = పశువులైన ఇంద్రియముల కధిపతికి, నీలగ్రీవాయ = నల్లని మెడ గలవానికి, చ = మరియు, నమః = నమస్కారము.

విశేషము : భవము అనగా పుట్టుట మరియు పుట్టుటకు కారణమగు సంసారబంధము. ఈ రెండింటి యందును రుద్రుని అంతర్యామిత్వమును భావింప వలెనని అర్థము. భావించినచో సంసారబంధము తొలగును.

శర్వుడనగా శరములను లేక అమ్ములను ప్రయోగించువాడు. భావములే అమ్ములుగా దేవుని భావించి యింద్రియముల ప్రవృత్తులపై ప్రయోగించినచో నింద్రియముల పశుత్వము అదుపులో నుండును.

పశువులనగా నింద్రియములు. తన ధ్యానమున నింద్రియములను బంధింపగలడు కనుక పశుపతి అనబడును.

నీలగ్రీవుడనగా నల్లని గొంతు గలవాడు. అమృత మథనమున హాలాహలము పుట్టగా దానిని భక్షించుట వలన శివుని గొంతున నల్లతన మేర్పడినది.

మంత్రము : శితి కంఠాయ చ నమః కపర్దినేచ
51 వ్యుప్త కేశాయ చ ॥

తా॥ తెల్లని కంఠము గలవానికి నమస్కారము. జటాజూటము గలవానికి నమస్కారము. కేశములు తీయించుకొనిన రుద్రునకు నమస్కారము.

టీక : శితికంఠాయ చ = తెల్లని కంఠము గలవాని కొరకును, కపర్దినేచ = జడలచుట్ట ధరించిన వాని కొరకును, వ్యుప్త కేశాయచ = కేశములు తీయించుకొనిన వాని కొరకును, నమః = నమస్కారము.

విశేషము : శితికంఠుడు : హాలాహలము భక్షించుటవలన కంఠమున నల్లనిచుక్క ఏర్పడినది. మిగిలిన కంఠమురంగు దేహము వలెనే తెల్లగా నుండును. జీవుల విశుద్ధి చక్రమున కంఠమునందు స్వరపేటిక కల్గుట వలననే నాదస్వరూపుడుగా రుద్రుడు జగత్తుయొక్క రూపమై వ్యాఖ్యానము చెందుచున్నాడు.

2) కపర్ది : శిరస్సునందు పుట్టిన తపోమయము లైన తేజస్సులే జడలచుట్టలుగా వర్ణింపబడును.

3) వ్యుప్తకేశుడు : మరల మరల మొలుచునట్టి సంసార జీవుల అభిప్రాయములే శిరస్సున మొలుచు కేశములుగా పోల్చ

బడినవి. యోగ సాధనయందు వైరాగ్యము సిద్ధించునపుడు ఈ అభిప్రాయము లన్నియు తొలగింపబడును. కనుక అప్పటి స్థితిని కేశములు గొరిగించుకొనిన రుద్రమూర్తిగా వర్ణించు చున్నారు. ఇట్లు జరిగినవారికి మాత్రమే సన్యాస స్థితియును, దానికి లక్షణమయిన శిరోముండనము సార్థకములు.

మంత్రము : నమస్సహస్రాక్షాయచ శతధన్వనేచ।

తా॥ వేయి కనులు గలవానికి, నూరు ధనుస్సులు గల వానికి నమస్కారము.

టీక : సహస్రాక్షాయ + చ = వేయి కన్నులు గలవానికి మరియు, శతధన్వనే = నూరు ధనుస్సులు గలవానికిని.

విశేషము : 1) వేయి కన్నులు గలవాడు ఇంద్రుడు. మేఘముల నుండి మెఱపుల రూపములైన కన్నులతో చూచు వాడు. ఇంద్రుడు రుద్రుని మూర్తులలో నొకడుగా చెప్పబడినది. అంతేకాక కంటికి నాధారమైన సూర్యకిరణము కన్నుగా వర్ణింప బడుట వేదపురాణ కవిసమయము. ఈ యర్థమున సహస్రాక్షు డనగా సూర్యుడు, వేయి కిరణములు గలవాడు. ఈ యర్థముననే ఇంద్రుడు అహల్యాజారుడని వేదములయందు కీర్తింపబడెను. అహస్సు లీనమగునట్టి రాత్రి అహల్య అనబడును. ఆమెను జరింప చేయువాడు అనగా కనుపింపకుండ చేయువాడు ఉదయ సూర్యుడు. మరియు సంవత్సర చక్రమున దక్షిణా యనమున ప్రవేశించు వర్షాకాలపు సూర్యుడనియు నర్థము. హల్య అనగా నాగలి పెట్టుటకు తగిన భూమి. అహల్య అనగా నాగలికి ఇంకను తగులని వేసవికాలపు భూమి. ఆమెను జరింప

చేయువాడు వర్షాకాలమున మేఘములను కూర్చుకొను సూర్యుడు. కనుకనే ఇంద్రుడు మేఘాధిపతియని వర్ణింపబడుట. ఈ మంత్రార్థమే వేదార్థ ప్రతిపాదకమైన ఇతిహాసముగ రామాయణమున కీర్తింపబడెను. ఎట్లనగా, సూర్యకిరణము నుండి దిగివచ్చు సంవత్సర సృష్టిదేవతలు భూమిపై జీవులను పరిపాలించుటకు వచ్చిన సూర్యవంశపు రాజులుగా చెప్పబడెను. అందు మేఘము నీలదేహుడగు రాముడుగా రూపింపబడెను. వేసవికాలపు భూమి అహల్యగా, అచేతన స్థితిలో నుండగా రామ పాదస్పర్శ విమోచనము కల్గించి ఆమెను హల్యగా మార్చినది. అనగా నాగలి కనుకూలముగా పాకము తెచ్చినది. అటుపైన సీతాకల్యాణమున సీత యనగా నాగటిచాలు. అందుదున్నుట జనకుడు చేయు యజ్ఞముగా, నాగటిచాళ్ళయందు మేఘము వర్షించుట సీతాకల్యాణముగా, ఇంద్రధనుస్సు శివధనుస్సుగా రూపింప బడినది. ఇన్నిటికిని సార్థకమగు నామమే సహస్రాక్షుడు.

2) నూరు ధనుస్సులు కలవాడనగా నొకేమారు నూరు ధనుస్సుల యంత ప్రయోగముతో దుష్టసంహారము చేయువాడు. మరియు అక్షము, ధనుస్సు అను పదములకు సంకేతార్థమున్నది. చక్రాకారమైన ఆకాశపరిధికి సూర్యుడు కేంద్రము. కేంద్రము నుండి పరిధికి ప్రసరించు కిరణముల దారులు అక్షములు (Spokes). సూర్యుని చుట్టును గ్రహాదులు తిరుగుట కేర్పడిన మార్గములు ధనుస్సులు. వేదవాఙ్మయమున ధనుస్సు, ధన్వ అను పదములు పరిధి భాగములకు (Arcs) పర్యాయములుగ వాడబడినవి. సూర్యుడు వేల కిరణములతో అక్షములుగా దారు లేర్పరచి చక్రాకారమైన తారాత్మక సృష్టిని సంవత్సర మూర్తిగ త్రిప్పుచున్నాడని భావము.

మంత్రము : నమో గిరిశాయచ శిపివిష్టాయచ ।
53

తా॥ పర్వతము నందు శయనించినవాడును, జలములను పానము చేయుచు జీవులయం దంతర్యామిగ ప్రకాశించువాడును అగు రుద్రుని మూర్తికి నమస్కారము.

టీక : నమః + గిరిశాయ + చ = గిరియందు శయనించువానికి నమస్కారము, శిపివిష్టాయచ = జలములను పానము చేయు కిరణములయందు ప్రకాశించువానికి నమస్కారము.

విశేషము : 1) గిరియందు శయనించువాడనగా కైలాసము నివాసముగ కలవాడు, మరియు వాక్కునందు శయనించువాడు లేక శబ్దార్థముల తాత్పర్యరూపము కలవాడు అని అర్థము.

2) జలములను పానము చేయునవి సూర్యకిరణములు. వానియందు అంతర్యామిగ ప్రకాశించి భూమికి జీవుల రూపమున దిగివచ్చి మరల దప్పికరూపమున జలములను పానము చేయు వివిధ మూర్తులు కలవాడు. ఇచ్చట సృష్టి స్థితి లయములలో స్థితి కారకుడైన అంతర్యామి లేక విష్ణుమూర్తి అని యర్థము. కనుకనే శిపివిష్టుడు అనగా విష్ణువని పురాణములు కీర్తించును. నారాయణుడు అను పదమున కిది వాఖ్యానము. నారములనగా జలములు. జలములే తమ అయనములు లేక మార్గములుగ కలవాడు నారాయణుడు. ఈ అయనములు ఉత్తరాయనము, దక్షిణాయనము అని రెండు విధములు.

మంత్రము : నమో మీఢుష్టమాయ చేషుమతేచ ।
54

తా॥ మేఘము రూపమున పుష్కలముగా వర్షించు మూర్తికి నమస్కారము. అనేకములైన అమ్ములు గలవానికి నమస్కారము.

టీక : నమః + మీఢుష్టమాయచ = పుష్కలముగ వర్షించు మేఘరూపుడైన వానికి నమస్కారము, ఇషుమతేచ = అమ్ములు కలవానికి నమస్కారము.

విశేషము : ఇచ్చట వర్షామూర్తియైన ఇంద్ర రుద్రుడు మరల వర్ణింపబడెను. ఇందు చెప్పబడిన బాణములు వానజల్లుల కుపమానములు.

మంత్రము : నమో హ్రస్వాయచ వామనాయచ ।
55

తా॥ స్వల్పకాలమే కనుపించి మాయమగువానికి నమస్కారము. పొట్టివాని రూపముగల రుద్రునకు నమస్కారము.

టీక : నమః + హ్రస్వాయచ = అల్పమైన కాలపరిమాణము కలవానికి నమస్కారము, వామనాయ + చ = పొట్టివానికి నమస్కారము.

విశేషము : భగవంతుడు భౌతిక దేహబద్ధుడుగా జీవుని రూపము ధరించినపుడు వాని యస్థిత్వము జనన మరణముల నడుమ హ్రస్వమగును. భౌతిక దేహము పరిమిత పరిమాణము కలిగి వామనమగును.

మంత్రము : నమో బృహతేచ వర్షీయసేచ ।
56

తా॥ పెరిగిన శరీరముగల రుద్రునకు నమస్కారము. సంవత్సరములు తరబడి పెరిగిన శరీరమూర్తికి నమస్కారము.

టీక : నమః + బృహతే + చ = పెరిగి పెద్దవాడైన మూర్తికి నమస్కారము, వర్షీయసే + చ = వర్షములు (సంవత్సరములు) నిండినవానికి నమస్కారము.

విశేషము : జీవుడుగా దేహబద్ధుడైన మూర్తి పుట్టినపుడు వామనుడుగా నుండి క్రమముగా దేహము పెరుగును. మొదట చిన్నవాడుగ నుండి సంవత్సరముల పరిణామమున ముసలి శరీరమును ధరించును. ఇట్టి రూపము అభినయించుచున్న నటరాజమూర్తియగు జీవపాత్రధారికి నమస్కారమని భావము.

మంత్రము : నమో వృద్ధాయచ సంవృధ్వనేచ।

57

తా॥ గుణములచే వృద్ధిచెందినవానికి, వయస్సుచే ముసలితనము చెందినవానికి నమస్కారము. జ్ఞానముచే వేదముచే సంపూర్ణత యనబడు వృద్ధి పొందినవానికి నమస్కారము.

టీక : నమః + వృద్ధాయ + చ = వృద్ధిచెందిన వానికిని, ముసలితనము చెందిన వానికిని నమస్కారము, సంవృధ్వనే + చ = సంపూర్ణతయను వృద్ధిపొందినవానికి నమస్కారము.

విశేషము : ఇవియును దేహధారిగా నటించు రుద్రుని లీలలే.

మంత్రము : నమో అగ్రియాయచ ప్రథమాయచ।

తా॥ కొట్టకొనయున్న మూర్తికి నమస్కారము. మొట్టమొదటనున్న మూర్తికి నమస్కారము.

టీక : నమః + అగ్రియాయ + చ = అగ్రమునందు నిల్చిన వానికి నమస్కారము, ప్రథమాయచ = మొదట నిలిచిన వానికి నమస్కారము.

విశేషము : అగ్రమనగా ఆదికి ముందున్న భాగముగాని అంతమునకు చివరనున్న భాగముగాని, జననమునకు ముందు, మరణమునకు తరువాత కూడ నున్న జనన మరణాతీత శాశ్వత మూర్తియని అర్థము. అట్లే సృష్టికిముందు ప్రళయమునకు తరువాత గలవాడని యర్థము. సృష్టిజీవులలో పుత్రునకు తండ్రిగా, తండ్రికి పుత్రుడుగా కనిపించు మూర్తియని చమత్కారము.

ప్రథముడు అనగా మొదట పుట్టినవాడు. సృష్టిలో చతుర్ముఖుని మూర్తి. భూతసృష్టిలో అనగా పంచభూతములలో మొదటివాడు ఆకాశమూర్తి. ఇతడు సర్వాంతర్యామికి ప్రత్యక్షరూపము. భగవంతుడు ఆకాశ శరీరుడని తైత్తిరీయము చెప్పుచున్నది. అన్ని లోకముల యందును మొదట పుట్టినవాడు అగ్ని. అగ్రమునందు నీయమానుడు లేక మొదటగా సృష్టిలోనికి కొనిరాబడినవాడు కనుక అగ్నియని పేరు వచ్చినదని వేద నిర్వచనము.

మంత్రము : నమ ఆశవే చాజిరాయచ ।

58

తా॥ శీఘ్రగమనము గల మూర్తికి నమస్కారము. మొక్క వోవని సామర్థ్యము గలవానికి నమస్కారము.

టీక : నమః + ఆశవే + చ = అలుపు లేక వేగ గమనము గల వానికి నమస్కారము. అజిరాయచ = జీర్యత్వము లేక మొక్కవోపుట లేనివానికి నమస్కారము.

విశేషము : వేగ గమనమనగా వస్తువుల గమనమునందు అంతర్యామిగ నున్న వేగ మనబడు గుణము. ఇది రుద్రుని అవ్యక్తములైన రూపములలో నొకటి. వస్తువులు వేగవంతములై యుండగా వానియందు మరుగుపడి వేగమను గుణముండును. అది కాలస్వరూపము. సామర్థ్యము కలవాడనగా సమర్థత గల వారిలో మరుగుపడియున్న సామర్థ్యమనబడు గుణము.

మంత్రము : నమశ్శీఘ్రియాయచ శీభ్యాయచ ।

59 తా॥ గమనమున శీఘ్రత గల మూర్తికి నమస్కారము. గమనమున ప్రవాహలక్షణము గల మూర్తికి నమస్కారము.

టీక : నమః + శీఘ్రియాయ + చ = శీఘ్రమైన గమనము గల వానికి నమస్కారము, శీభ్యాయ + చ = ప్రవాహరూపమైన గమనము గలవానికి నమస్కారము.

విశేషము : శీఘ్రగమనము దేహధారులకు గల గుణము. ప్రవాహ గమనము రక్తప్రసారాదులకు గల గుణము. ఈ రెండింటి యందు మరుగుపడియున్న గమనరూపుడైన రుద్రునకు నమస్కారము.

మంత్రము : నమ ఊర్మ్యాయ చావస్వన్యాయచ ।

60 తా॥ అలల రూపమైన గమనము గలవానికి నమస్కారము. నిశ్శబ్దమైన గమనము గలవానికి నమస్కారము.

టీక : నమః + ఊర్మ్యాయచ = అలల రూపము గలవానికి నమస్కారము, అవస్వన్యాయచ = శబ్దము లేని రూపము గల వానికి నమస్కారము.

విశేషము : శబ్ద స్పర్శ రూప రస గంధములు తరంగ రూపములై జీవునియందు గమనము చేయును. మనస్సు నిశ్శబ్ద రూపమై భావమయ తరంగములుగ గమనము చేయును. ఇచ్చట మంత్రములలో వేగ గమనము, శీఘ్ర గమనము, ప్రవాహరూప గమనము, తరంగరూప గమనము, మనోమయ రూప గమనము అను గమనముల వేగములు రుద్రుని మూర్తులుగ నారాధింపబడినవి.

మంత్రము : నమస్స్రోతస్యాయచ ద్వీప్యాయచ ।
61

తా॥ నదీప్రవాహముల కధిపతి యగు రుద్రునకు నమస్కారము. నదుల మధ్య నేర్పడు ద్వీపముల కధిపతికి నమస్కారము.

టీక : నమః + స్రోతస్యాయ + చ = స్రోతస్సులు (ప్రవాహములు) కలవానికి నమస్కారము. ద్వీప్యాయ + చ = ద్వీపములు కలవానికి నమస్కారము.

విశేషము : స్రోతస్సులనగా దేహమందలి రక్తనాళములు. ద్వీపములనగా నడుమ నడుమ నేర్పడు శరీర గ్రంథులు. బాహ్యప్రపంచమున విరాట్పురుషునకు నివియే నదులు. ద్వీపములుగా మొదట నేర్పడును. మన దేహములలో రక్తనాళములుగా, గ్రంథులుగా నేర్పడును. ఈ మంత్రము నుపాసించుట వలన నదులలోని నీరు, ద్వీపములలో సారవంతమైన కృషి చక్కగా లాభించును. మరియు వ్యాధిగ్రస్తులకు రక్త నాళముల వ్యాధులు, గ్రంథుల వ్యాధులు తొలగును.

మంత్రము : నమో జ్యేష్ఠాయచ కనిష్ఠాయచ ।
62

తా॥ మొట్టమొదట చెప్పదగిన మూర్తికి నమస్కారము. చిట్టచివర చెప్పదగిన మూర్తికి నమస్కారము.

టీక : నమః + జ్యేష్ఠాయ + చ = గుణములు, సామర్థ్యము, విద్య మున్నగు వానిచే మొట్టమొదట లెక్కింప దగినవానికి నమస్కారము, కనిష్ఠాయ + చ = అల్పముగా నున్న లక్షణములతో చిట్టచివర లెక్కింప దగినవానికి నమస్కారము.

విశేషము : విద్యా వినయాదులలో పెద్దలైన వారిని మాత్రమే దైవరూపములుగ చూచినచో ముక్తిరాదు. తనకన్న తక్కువవారుగా కనుపించు వ్యక్తులను గూడ దేవుని మూర్తులుగ భావింపవలెను.

మంత్రము : నమః పూర్వజాయ చాపరజాయచ ।
63

తా॥ ముందు పుట్టినవానికి నమస్కారము. వెనుక పుట్టిన వానికి నమస్కారము.

టీక : నమః + పూర్వజాయ + చ = పూర్వమునందు పుట్టినవానికి నమస్కారము, అవరజాయచ = తరువాత పుట్టిన వానికి నమస్కారము.

విశేషము : పూర్వమున పుట్టినవాడనగా విరాట్ అనబడు హిరణ్య గర్భాండ రూపము గలవాడు. చివర పుట్టినవాడనగా ప్రళయము రూపమైనవాడు. అంతేకాక తనకన్న ముందు పుట్టిన వారిని, తరువాత పుట్టినవారిని గూడ రుద్రుని రూపములుగ దర్శించినపుడే అంతర్యామి సాధన పూర్తియగును.

మంత్రము : నమో మధ్యమాయ చాపగల్భాయచ ।

తా॥ మధ్యముడైన మూర్తికి నమస్కారము. మాటాడుట మున్నగునవి ఇంకను చేతగాని శిశువు రూపమైన వానికి నమస్కారము.

టీక : నమః + మధ్యమాయ + చ = మధ్యమునకు నమస్కారము, అపగల్భాయచ = మాటాడుట మున్నగునవి రానివానికి నమస్కారము.

విశేషము : 1) మధ్యముడనగా ఉత్తమ గుణ సంపన్నుడు గాని హీనగుణములు గలవాడుగాని కాక సామాన్యుడుగ జీవించువాడు. మరియు మధ్యమలోకము అనబడు భూలోకమున దేహధారియై తిరుగువాడు. నరదేహ స్వరూపుడని యర్థము. హృదయ మధ్యమమున ఈశ్వరుని రూపుడై యుండి ఇంద్రియాదులను నడిపించువాడు.

2) మాటాడుట నేర్చుకొనని శిశువునందు గూడ దైవ మూర్తిని ధ్యానింపవలెను.

మంత్రము : నమో జఘన్యాయచ బుధ్నియాయచ ।

64 తా॥ దేహము వెనుక భాగమునుండి పుట్టిన చతుష్పాత్తుల రూపముగల రుద్రునికి నమస్కారము. వేళ్ళు నాటుకొని పైకి మొలిచిన వృక్షముల రూపుడైన రుద్రునికి నమస్కారము.

టీక : నమః + జఘన్యాయ + చ = జఘనముల వైపు నుండి జననము గల వానికి నమస్కారము, బుధ్నియాయచ = మూలము నందు పుట్టిన వానికి నమస్కారము.

విశేషము : జఘన్యము అనగా చతుష్పాత్తుల వంటి పశు ప్రవృత్తులుగల స్వభావమని గూడ నర్థము. అట్టి నీచ ప్రవర్తనులతో మెలగు చున్నపుడు గూడ క్రోధ ద్వేషాదులకు గురి కాకుండుటకై వారిని రుద్రుని కపట మూర్తులుగ ధ్యానింపవలెను.

మంత్రము : నమస్సోభ్యాయచ ప్రతిసర్యాయచ ।

65

తా॥ ఉభయములైన ప్రవర్తనల యందును జీవించు మూర్తికి నమస్కారము. చేతికి రక్షాబంధము ధరించిన మూర్తికి నమస్కారము.

టీక : నమః + సోభ్యాయ + చ = ఉభయ ప్రవర్తనలతో కూడిన వానికి నమస్కారము, ప్రతిసర్యాయచ = ప్రతిసరము (రక్షాబంధనము) గలవానికి నమస్కారము.

విశేషము : 1) ఉభయ ప్రవర్తనలనగా దివ్య ప్రవర్తనము, మానుష ప్రవర్తనము మరియు దైవ స్వభావము, అసుర స్వభావము. లోకమున మంచివారును చెడ్డవారును వేరువేరుగా నుందరు. మంచిచెడ్డలు కలసిన స్వభావము గలవా రుందురు. వారందరిని రుద్రుని మూర్తులుగా జ్ఞప్తి యుంచుకొనవలెను.

2) రక్షాబంధనము ధరించువారనగా వివిధ దీక్షలలో కాలమును సద్వినియోగము చేయువారు.

మంత్రము : నమో యామ్యాయచ క్షేమ్యాయచ ।

66

తా॥ యమముకల మూర్తులకు నమస్కారము. క్షేమము ననుభవించు నీతికుశలులైన మూర్తులకు నమస్కారము.

టీక : నమః + యామ్యాయ + చ = యమమునకు సంబంధించిన వారికి నమస్కారము.

విశేషము : యమము యోగమందలి అష్టాంగములలో మొదటిది. అహింస, సత్యము, దొంగబుద్ధి లేకుండుట, ఓర్పు మొదలగు గుణముల నలవరచుకొను క్రమశిక్షణము, శాస్త్రమున నిది నిర్వచింపబడినది. క్షేమమనగా నిర్భీతి, సకల బంధమోచన మైన స్థితి.

మంత్రము : నమ ఉర్వర్యాయచ ఖల్యాయచ ।

67 తా॥ ధాన్యములు పండునట్టి పంటపొలము రూపమైన మూర్తికి నమస్కారము. ధాన్యమును నూర్పిడిచేయు కళ్ళము రూపమైన మూర్తికి నమస్కారము.

టీక : నమః + ఉర్వరాయ + చ = సమస్త ధాన్యములు పండునట్టి పొలమునకు నమస్కారము, ఖల్యాయ + చ = కుప్ప నూర్పిడిచేయు కళ్ళమునకు నమస్కారము.

విశేషము : పొలము పండుట దైవశక్తికిని, కళ్ళమున నూర్చుట మనుష్య ప్రయత్నమునకును సంకేతము. ఈ రెండును కలిసినచోట మాత్రమే అన్నము పుట్టుట జరుగును.

మంత్రము : నమశ్శ్లోక్యాయ చావసాన్యాయచ ।

68 తా॥ శ్లోకములచే స్తుతింపబడు మూర్తికి నమస్కారము. శ్లోకము లెపోయినవెనుక ప్రశంసింపబడు మూర్తికి నమస్కారము.

టీక : నమః + శ్లోక్యాయ + చ = శ్లోకములచే స్తుతింపబడు వానికి నమస్కారము, అవసాన్యాయ + చ = శ్లోకముల అవసానమున స్తుతింపబడువానికి నమస్కారము.

విశేషము : శ్లోకము అనగా వేద మంత్రములు. అవసానము అనగా వేదముల అంతముగా చెప్పబడిన ఉపనిషత్తులు. మరియు వాక్కులచే స్తుతింపబడు మూర్తికిని, వాక్కులు, మనస్సు నిలచిపోయిన వెనుక ధ్యానింపబడు మూర్తికిని నమస్కారమని భావము.

మంత్రము : నమో వన్యాయచ కక్ష్యాయచ ।
69

తా॥ వనములందు పెరిగిన వృక్షాదుల రూపములు ధరించినవానికి నమస్కారము. దడికట్టి దొడ్లలో పెంచబడిన రూపములు గలవానికి నమస్కారము.

టీక : నమః + వన్యాయ + చ = వనమున పెరిగిన మహా వృక్షముల రూపము గలవానికి నమస్కారము, కక్ష్యాయచ = దడులు అడ్డముకట్టి పెంచబడిన లతలు మున్నగువానికి నమస్కారము.

విశేషము : అప్రయత్నముగా అడవులలో పెరిగిన వానినికి, ప్రయత్నముచేత పెంచబడిన వానికిని నమస్కారమని యర్థము. పురుష ప్రయత్నమునకు లొంగిన సంపద, దానికతీతమైన సంపద యని భావము.

మంత్రము : నమ శ్శ్రవాయ చ ప్రతిశ్రవాయచ ।
70

తా॥ వినబడునట్టి శబ్దస్వరూపునకు నమస్కారము. ప్రతిధ్వని చేయు శబ్ద స్వరూపునకు నమస్కారము.

టీక : నమః + శ్రవాయ + చ = వినబడు శబ్దమునకు నమస్కారము, ప్రతిశ్రవాయచ - ప్రతిధ్వనిగ వినబడు శబ్దమునకు నమస్కారము.

విశేషము : వినబడు శబ్దము అనాహత మనబడు అంతర్లీన శబ్దము లేక ప్రణవము. ఇదికాక చెవులకు వినిపించునది శబ్ద తరంగముల ప్రతిధ్వని. ఈ రెండు విధములైన రుద్ర మూర్తులు చెప్పబడినవి. అంతేకాక పలుకుచున్నవాని రూపమునకును బదులు పలుకుచు సంభాషించు చున్నవాని రూపము ధరించిన రుద్రునకు నమస్కారము.

మంత్రము : నమ ఆశుషేణాయ చాశురథాయచ ।

71 తా॥ వేగ గమనము గల సేనలను నడిపించువానికి నమస్కారము. వేగవంతములైన రథములు గలవానికి నమస్కారము.

టీక : నమ + ఆశుషేణాయ + చ = ఆశువైన గమనము గల సేనల కధిపతికి నమస్కారము, ఆశురథాయచ = వేగ గమనము గల రథములు గలవానికి నమస్కారము.

విశేషము : యుద్ధము చేసి రక్షణ చేయునట్టి సేనాధిపతులు, మహారథులు అగు క్షత్రియుల మూర్తులకు నమస్కారము.

మంత్రము : నమ శూరాయ చావభిన్దతేచ ।

72

తా॥ యుద్ధశూరులైన రూపులకు నమస్కారము. శత్రువుల వ్యూహములను భేదించు మూర్తులకు నమస్కారము.

టీక : నమః + శూరాయ + చ = శూరునకు నమస్కారము, అవభిన్దతేచ = వ్యూహములను భేదించువానికి నమస్కారము.

మంత్రము : నమో వర్మిణేచ వరూథినేచ ।

73 తా॥ మంచి కవచము ధరించిన మూర్తికి నమస్కారము. మంచి చర్మపు కవచము ధరించినవానికి నమస్కారము.

టీక : నమః + వర్మిణే + చ = లోహమయమైన చర్మము ధరించిన వానికి నమస్కారము. వరూథినేచ = చర్మమయ కవచము ధరించిన వానికి నమస్కారము.

విశేషము : వర్మ యనగా ఛాతియందు ధరించు లోహమయ కవచము, వరూథమనగా ఉడుము చర్మము మున్నగు జంతుచర్మములచే చేయబడి చేతులకు కాళ్ళకు తొడుగునట్టి కవచము.

మంత్రము : నమో బిల్మినేచ కవచినేచ ।

74 తా॥ రన్నములుగల డిప్ప కవచమును శిరస్సునకు తొడిగిన వానికి నమస్కారము. మంత్రమయ కవచమును ధరించినవానికి నమస్కారము.

టీక : నమః + బిల్మినే + చ = బిలములుగల తలడిప్ప ధరించిన వానికి నమస్కారము, కవచినేచ = మంత్రాక్షరమయమైన రక్షణము ధరించిన వానికి నమస్కారము.

విశేషము : మంత్రాక్షరములను శరీర భాగములయందు జ్యోతిర్మయములుగా ధ్యానించుటవలన అన్ని యరిష్టముల నుండి కాపాడునట్టి కవచ మేర్పడును. ఉదా : నారాయణ కవచము, శివ కవచము.

మంత్రము : నమ శ్శ్రుతాయచ శ్రుతసేనాయ చ ।

75 తా॥ కీర్తి ప్రతిష్ఠలు కలవానికి నమస్కారము. కీర్తి ప్రతిష్ఠలుగల సేనలు కలవానికి నమస్కారము.

టీక : నమ + శ్రుతాయ + చ = శ్రుతము లేక కీర్తి గల వానికి నమస్కారము, శ్రుతసేనాయచ = కీర్తిమంతులైన శూరులు సేనలుగా గలవానికి నమస్కారము.

మంత్రము : నమో దున్దుభ్యాయ చాహనన్యాయచ ।

76 తా॥ యుద్ధమున రణభేరి మ్రోగించు మూర్తికి నమస్కారము. రణభేరి మ్రోగించు పిడికట్టు రూపమైన మూర్తికి నమస్కారము.

టీక : నమః + దుందుభ్యాయ + చ = దుందుభి మ్రోగించు వానికి నమస్కారము. అహనన్యాయచ = దుందుభిపై దెబ్బకొట్టు పిడికట్టు రూపమైన వానికి నమస్కారము.

మంత్రము : నమో ధృష్ణవేచ ప్రమృశాయచ ।

77 తా॥ యుద్ధమున శత్రువులను భయపెట్టు మూర్తికి నమస్కారము. బలాబలములను విమర్శించు కొనగల మూర్తికి నమస్కారము.

టీక : నమః + ధృష్ణవే + చ = యుద్ధమున ధర్షణచేయుట లేక భయపెట్టుట తెలిసినవానికి నమస్కారము, ప్రమృశాయచ = ప్రకృష్టముగా విమర్శ చేయగలవానికి నమస్కారము.

మంత్రము : నమో దూతాయచ ప్రహితాయచ ।

78

తా॥ దూతగా పంపదగిన మూర్తికి నమస్కారము. ప్రభువుచే హితము గోరి పంపబడు రాయబారి రూపమైన వానికి నమస్కారము.

టీక : నమః + దూతాయ + చ = దూతరూపమైన వానికి నమస్కారము, ప్రహితాయ + చ = ప్రభువుచే పంపబడు మూర్తికి నమస్కారము.

విశేషము : దూత యనగా వృత్తాంతమును గ్రహించి వచ్చినట్టి నేర్పరి. ప్రహితుడనగా సంధికిగాని, ఇరుపక్షముల హితమునకుగాని సంప్రతించుటకై ప్రభువులచే పంపబడువాడు.

మంత్రము : నమో నిషఙ్గిణే చేషుధిమతేచ ।

79

తా॥ ఒరయందు కత్తి ధరించినవానికి, అమ్ముల పొదులు ధరించిన వానికి నమస్కారము.

టీక : నమః + నిషంగిణే + చ = ఒరలో ఖడ్గము గల వానికి నమస్కారము, ఇషుధిమతే + చ = అమ్ములపొది కలవానికి నమస్కారము.

మంత్రము : నమస్తీక్ష్ణేషవే చాయుధినేచ ।

80

తా॥ వాడియైన బాణములు ధరించిన వానికిని, వివిధా యుధములు ధరించిన వానికిని నమస్కారము.

టీక : నమః + తీక్ష్ణేషవే + చ = తీక్ష్ణములైన బాణములు ధరించిన వానికి నమస్కారము, ఆయుధినేచ = ఆయుధము లన్నిటిని ధరించిన వానికి నమస్కారము.

మంత్రము : నమస్స్వాయుధాయచ సుధన్వనేచ।

81

తా॥ మంచి ఆయుధములు, మంచి ధనుస్సు ధరించిన వానికి నమస్కారము.

టీక : నమః + సు + ఆయుధాయ + చ = మంచి ఆయుధ ములు ధరించినవానికి నమస్కారము, సుధన్వనేచ = మంచి ధనుస్సు ధరించినవానికి నమస్కారము.

విశేషము : ఈ ఘట్టమున క్షాత్రధర్మము రాజుగా, సేనా నాయకుడుగా, సేనానిగా, ఆయుధములుగా, కవచములు భేరి మున్నగు యుద్ధ సన్నాహములుగా దుష్టసంహార మూర్తియై ప్రజాధర్మమును రక్షించు మూర్తియైన రుద్రుడు ప్రశంసింప బడెను.

మంత్రము : నమస్స్రుత్యాయచ పథ్యాయచ।

82

తా॥ కాలిదారి వెంట నడచువానికి నమస్కారము. మహా పథము వెంట నడచువానికి నమస్కారము.

టీక : నమః + స్రుత్యాయ + చ = అంతకుముందు నడచిన వారి పాదముల వలన నేర్పడిన దారివెంట నడుచువానికి నమస్కారము, పథ్యాయచ = రహదారియైన మహాపథములవెంట నడచువానికి నమస్కారము.

విశేషము : స్రుతి యనగా పాదముల ప్రసారమువలన నేర్పడిన దారి. అది ఋషు లేర్పరచిన సంప్రదాయమని యర్థము. పథమనగా రథములు మున్నగునవి ప్రయాణము చేయుటకై విశాలముగా తీర్చబడిన బాట. నాగరికు లేర్పరచుకొనిన లౌకిక వ్యవహార మార్గములని భావము. ఈ రెండు మార్గముల యందును నరరూపుడైన రుద్రుడు జీవయాత్ర నటించును.

మంత్రము : నమః కాట్యాయచ నీప్యాయచ।

83

తా॥ నదులనుండి పాయలుగా నేర్పడిన కాలువల వెంట ప్రయాణము చేయువానికి నమస్కారము. కొండల నుండి దుముకుచున్న సెలయేళ్ళ మార్గమున ప్రయాణము చేయువానికి నమస్కారము.

టీక : నమః + కాట్యాయ + చ = కాలువల ప్రవాహమున పయనించు వానికి నమస్కారము, నీప్యాయ + చ = సెలయేళ్ళ మార్గమున ప్రయాణము చేయువానికి నమస్కారము.

విశేషము : కాటమనగా నీటివసతి యేర్పరుపబడిన నది, కాలువ. ఉదాహరణము : కృష్ణకాలువ, గోదావరి కాలువ. నీప మనగా ఎత్తైన ప్రదేశమునుండి పడునట్టి జలప్రవాహము.

సౌమ్యమైన సాధన చేయువాడు, తీవ్రమైన సాధన చేయువాడు అని భావము.

మంత్రము : నమ స్సూద్యాయచ సరస్యాయచ ।

84 తా॥ బురద ప్రదేశములలో నడచువానికి నమస్కారము. కొలనియందు చరించువానికి నమస్కారము.

టీక : నమః + సూద్యాయ + చ = బురద ప్రదేశమున నడచువానికి నమస్కారము, సరస్యాయచ = సరస్సునందు విహరించువానికి నమస్కారము.

విశేషము : బురదలో నడచువాడనగా కామక్రోధాదులలో దిగబడిన సంసారబద్ధుడు. సరస్సున తిరుగువాడనగా మానసము నందు విహరించు హంస వంటివాడు లేక పరమహంస స్వరూపుడు.

మంత్రము : నమో నాద్యాయచ వైశన్తాయచ ।

85 తా॥ నదియందు విహరించువానికి నమస్కారము. చిన్న నీటి పడియలయందు విహరించువానికి నమస్కారము.

టీక : నమః + నాద్యాయ + చ = నదియందు విహరించు వానికి నమస్కారము, వైశన్తాయచ = చిన్న దొరువులందు విహరించువానికి నమస్కారము.

విశేషము : నదియందు ప్రవహించు జలస్వరూపుడు, దొరువుల యందు నిలిచియున్న జలస్వరూపుడు అగు రుద్రునకు

నమస్కారము. మార్పులతో కూడిన జీవితము కలవారు, నిశ్చలత్వము చెందినవారు అని అర్థము.

మంత్రము : నమః కూప్యాయ చావట్యాయచ ।

86 తా॥ నూతిలోనున్న నీటిరూపము గలవానికి నమస్కారము. పల్లమున నిలిచిన నీటిరూపము గలవానికి నమస్కారము.

టీక : నమః + కూప్యాయ + చ = కూపమునందున్న జలమూర్తికి నమస్కారము, అవట్యాయ + చ = అవటమునందున్న జలస్వరూపునకు నమస్కారము.

విశేషము : కూపమనగా నుయ్యి. అవటమనగా నీరు వల్లమునకు పారిన గుంట. నిర్మలమూర్తికిని, మలినమైన మూర్తి గలవానికిని నమస్కారమని యర్థము.

మంత్రము : నమో వర్ష్యాయ చావర్ష్యాయచ ।

87 తా॥ వర్షించిన జలము రూపము గలవానికి నమస్కారము. వర్షింపని జలము రూపమున నున్న వానికి నమస్కారము.

టీక : నమః + వర్ష్యాయ + చ = వర్షపు నీటిరూపము వానికి నమస్కారము, అవర్ష్యాయ + చ = వర్షింపని నీటిరూపము గలవానికి నమస్కారము.

విశేషము : వర్షించిన జలమనగా నదులు, కాలువలు, సముద్రములు, నూతులు. వర్షింపని జలమనగా కొబ్బరికాయల

లోను, పండ్లలోని రసములోను, జీవుల రక్తాదులలోను గల జల స్వరూపము.

మంత్రము : నమో మేఘ్యాయచ విద్యుత్యాయచ।

88

తా॥ మేఘము నందున్న జలస్వరూపునకు నమస్కారము. మెరపు తీగెలతో కూడిన జలస్వరూపునకు నమస్కారము.

టీక : నమః + మేఘ్యాయ + చ = మేఘము నందున్న నీటి రూపము వానికి నమస్కారము, విద్యుత్యాయ + చ = విద్యుత్తు లందున్న జలమూర్తికి నమస్కారము.

మంత్రము : నమ ఈధ్రియాయ చాతప్యాయచ।

89

తా॥ ప్రకాశించునట్టి మేఘము నందున్న వానికి నమస్కారము. ఎండపొడ పడుచున్న మేఘమందలి జలమూర్తికి నమస్కారము.

టీక : నమః ఈ + ధ్రియాయ + చ = నిర్మలముగా ప్రకాశించునట్టి మేఘము రూపమునకు నమస్కారము, ఆతప్యాయ + చ = ఆతపముతో కూడిన మేఘము నందలి జలమూర్తికి నమస్కారము.

విశేషము : ప్రకాశించుచున్న మేఘమనగా శరదృతువు నందలి మబ్బు. ఆతప్యమనగా ఎండపొడలో వర్షించుచున్న మబ్బు.

మంత్రము : నమో వాత్యాయచ రేష్మియాయచ।

90

తా॥ సుడిగాలితో తిరుగుచున్న మబ్బు రూపమువానికి నమ స్కారము. వడగండ్లు కురియుచున్న మేఘము రూపము వానికి నమస్కారము.

టీక : నమః + వాత్యాయ + చ = సుడిగాలిలో తిరుగు చున్న మబ్బు రూపము వానికి నమస్కారము, రేష్మియాయ + చ = వడగండ్లువడు మేఘమునందున్న జలస్వరూపునకు నమ స్కారము.

విశేషము : ఇందు వరుసగా వర్షఋతువులోని వివిధ ధర్మ ములు రుద్రమూర్తులుగా నారాధింప బడినవి.

మంత్రము : నమో వా స్తవ్యాయచ వాస్తుపాయచ।

91

తా॥ ఏ వస్తువునకు తగిన వా స్తవ్యత, ఏ వ్యక్తికి తగిన వా స్తవ్యత అర్హతను బట్టి ఏర్పడు వసతి రూపమైన మూర్తికి నమస్కారము. గృహములు నిర్మాణముచేయు ప్రదేశమును రక్షించువానికి నమస్కారము.

టీక : నమః + వా స్తవ్యాయ + చ = వా స్తవ్యుడగు (వసతి స్వరూపుడగు) మూర్తికి నమస్కారము. వాస్తుపాయచ = వాస్తును రక్షించు మూర్తికి నమస్కారము.

విశేషము : వా స్తవ్యుడనగా ఆకారము, నామము, రూపము, దేహములు మొదలగు నుపాధులుగా నుండువాడు. వాస్తువనగా గృహ నిర్మాణము, దానిని రక్షించువాడు వాస్తు పురుషుడు లేక వాస్తోష్పతి. కట్టించుకొను గృహము యొక్క

వథకము బొమ్మను తన దేహమందలి అవయవములుగా దాల్చి యతడు భూమిపై వెల్లకిల పరుండి యుండునని వాస్తుశాస్త్రము చెప్పును. ఈశాన్యమున ముఖము, నైఋతియందు మలమూత్రావయవములు, మొదలగు దేహభాగములతో నితడు శయనించి యుండును.

అంతేకాక జీవులకు దేహనిర్మాణము వాస్తువు లేక పురము అనబడును. అందలి పాంచభౌతికమైన ద్రవ్యము పురీషము (పుర నిర్మాణమునకై కోరబడినది) గా నుండును. దీనినే ఉచ్ఛిష్టము (వెలుపలకు మిగిలి పోవునది) అనియు దీనితో దేహమనబడు దేవాలయ నిర్మాణము విశ్వకర్మచే వ్యూహము చేయబడి మయునిచే నిర్మింపబడు ననియు అథర్వణ వేదము, మహాభారతము చెప్పుచున్నవి.

మంత్రము : నమస్సోమాయచ రుద్రాయచ।

92

తా॥ సోముని రూపము ధరించిన రుద్రునకు నమస్కారము.

టీక : నమః + సోమాయ + చ = సోమునకు నమస్కారము, రుద్రాయ + చ = రుద్రునకు నమస్కారము.

విశేషము : సోముడనగా గంధర్వుడు. ఇతడు సంగీత విద్య కధిపతి. ఇతడు సాధకుని శిరస్సున సోమకందము, సోమగ్రంథియను తావున నుండును. దీనినే ఇంద్రగ్రంథి యనియు, ఇంద్ర యోని అనియు వేదములు కీర్తించును. దీనియందు సంగీతవిద్యకు కావలసిన లయ యనబడు కాలవిభాగ రూపమగు తాళజ్ఞాన ముండును. మరియు నాదోద్భవమైన సర్వజ్ఞాన

ముండును. ఇది యోగికి ప్రకృతి పురుషుల సంగమ స్థానము అనబడు సహస్రదళ పద్మము. ఇందు శక్తి శివునియందు సంగమించి యుండును. కనుకనే సోముడు అనగా స + ఉమ (ఉమా దేవితో కూడినవాడు) అని యర్థము.

రుద్రుడనగా రోదసి యనబడు అంతరిక్షమున కధిపతి. ఇతడు స్పందన స్వరూపుడు. ఇతని నుండి దిగివచ్చిన స్పందనములే పది ఇంద్రియములు, మనస్సు అనబడు ఏకాదశ మూర్తులుగా ప్రాణమయ కోశము జిడ్డుచేత దేహమున కంటిపెట్టుకొని యుండును. వాని మహిమ చేతనే శ్వాస ప్రారంభమునకై అప్పుడే పుట్టిన శిశువు రోదనము చేయును. రోదింపజేయువాడు కనుక రుద్రుడని శబ్దార్థము. మరియు జీవుడు దేహము విడుచు వేళ వీనిని దేహధాతువుల నుండి వెనుకకు పెల్లగించుచుండగా బంధుమిత్రాదులు రోదవము చేయుదురు గనుక రుద్రుడు. దీనికి కవిసమయముగనే యితడు శ్మశానవాసి యని పురాణములు చెప్పుచున్నవి.

మంత్రము : నమస్తామ్రాయ చారుణాయచ ।

93

తా॥ రాగిరంగు గలవానికి, ఎఱ్ఱరంగు గలవానికి నమస్కారము.

టీక : నమః + తామ్రాయ + చ = రాగిరంగు గలవానికి నమస్కారము, అరుణాయ + చ = ఎఱ్ఱరంగు గలవానికి నమస్కారము.

విశేషము : సూర్యుని రూపుడైన రుద్రమూర్తికి అస్త

మయ కాలమున నెఱ్ఱరంగు, ఉదయకాలమున రాగిరంగు చెప్పబడినవి. సంధ్యా నటనము చేయుచున్న నాట్యతాండవ స్వరూపుడైన రుద్రుడు చెప్పబడెను.

మంత్రము : నమశ్శఙ్గాయచ పశుపతయేచ ।

94

తా॥ సుఖమునకు గమ్యమైన మూర్తికి నమస్కారము. పశువులను పాలించు మూర్తికి నమస్కారము.

టీక : నమః + శంగాయ + చ = సుఖమునకు గమ్యమైన మూర్తికి నమస్కారము, పశుపతయే + చ = పశువులను పాలించు వానికి నమస్కారము.

విశేషము : శం అనగా సుఖము, శాంతి (భావములు మాయమైన వెనుక నిలిచిన తన రూపము లేక ఆత్మస్వరూపము). పశువులనగా త్రాటిచే గుంజకు కట్టబడినవి. ఇంద్రియ ప్రవృత్తులు అభ్యాసమను గుంజకు బంధింపబడి దానిచుట్టును తిరుగుచుండునని భావము.

మంత్రము : నమ ఉగ్రాయచ భీమాయచ ।

95

తా॥ భయంకరుడైన కోపమూర్తికి నమస్కారము.

టీక : నమః + ఉగ్రాయ + చ = కోపమూర్తికి నమస్కారము, భీమాయ + చ = భయమును కలిగించు మూర్తికి నమస్కారము.

విశేషము : కోపము భయమును కలిగించును. కోపిం

చిన వారిని జూచి భయపడుదురు.

మంత్రము : నమో అగ్రేవధాయచ దూరేవధాయచ।
96

తా॥ ఎదుటనున్న వానిని చంపగలవానికి నమస్కారము. దూరమున నున్న వానిని చంపగలవానికి నమస్కారము.

టీక : నమః+అగ్రేవధాయ + చ = అగ్రమునందు వధ చేయగల వానికి నమస్కారము, దూరేవధాయ + చ = దూర మున నున్న వానిని వధింపగలవానికి నమస్కారము.

విశేషము : యుద్ధమున గద, ఖడ్గము మున్నగు నాయుధ ములతో నెదుట నున్న వారిని చంపుదురు. అమ్ములతో, అస్త్రము లతో, దూరమున నున్న వారిని చంపుదురు.

మంత్రము : నమో హన్త్రేచ హనీయసేచ।
97

తా॥ చంపునట్టివానికి నమస్కారము. అంతకన్న నెక్కు వగా చంపునట్టివానికి నమస్కారము (చంపగలవారిని చంపు నట్టివానికి అని యర్థము).

టీక : నమః+హన్త్రే + చ = హంతకు : నమస్కారము, హనీయసే + చ = హంతను చంపువానికి నమస్కారము.

విశేషము : జీవులను చంపువాడు మృత్యువు. వానిని చంపువాడు మృత్యుంజయుడు. ఇచ్చట మార్కండేయుని కొరకు యముని పారద్రోలినవాడని భావము.

మంత్రము : నమో వృక్షేభ్యో హరికేశేభ్యః ।
98

తా॥ ఆకుపచ్చని జుట్టుగల వృక్షముల మూర్తులకు నమస్కారము.

టీక : నమః + వృక్షేభ్యః = వృక్షములకు నమస్కారము, హరికేశేభ్యః = ఆకుపచ్చని రంగు కేశములు గలవానికి నమస్కారము.

విశేషము : కేశములనగా ఆకుల గుబుర్లు.

మంత్రము : నమస్తారాయ నమశ్శమ్భవేచ మయోభవేచ ।
99

తా॥ తారకాస్వరూపునకు నమస్కారము. తారమను పేరు గలది అగు ఓంకార రూపునకు నమస్కారము. సుఖశాంతులను కలిగించువానికి నమస్కారము. ఇంద్రియాదులకు తృప్తిని, సంతోషమును కలిగించువానికి నమస్కారము.

టీక : నమః + తారాయ = తారాస్వరూపునకు నమస్కారము. నమః + శంభవే + చ = సుఖశాంతులను కలిగించువానికి నమస్కారము, మయోభవేచ = ఇంద్రియానందాదులు కలిగించువానికి నమస్కారము.

విశేషము : 1) "తారణాత్ తరణోపాయాత్ తారం ప్రణవ ముచ్యతే" అను మంత్రబీజ నిఘంటువు ప్రమాణమునుబట్టి తరణోపాయము నిచ్చు ప్రణవము తార మనబడును.

2) శం + భవ = శాంతిని పుట్టించువాడు, కనుక శంభు వని పేరు.

3) మయస్ + భవ అనగా సంబరపడునట్లు ఇంద్రియ సంతోషము పుట్టించువాడు.

మంత్రము : నమశ్శంకరాయచ మయస్కరాయచ ।
100

తా॥ శాంతిని కలిగించువానికిని, సంతోషము కలిగించు వానికిని నమస్కారము.

టీక : నమః + శంకరాయ + చ = శం అనబడు మోక్ష స్వరూపమగు శాంతిని పుట్టించువానికి నమస్కారము, మయస్కరాయ + చ = సంతోషమును, ఇంద్రియాదుల పరితృప్తిని కలిగించువానికి నమస్కారము.

మంత్రము : నమశ్శివాయచ శివతరాయచ ।
101

తా॥ శుభము లిచ్చు వానికి నమస్కారము. శుభములను మించిన శుభమగు శాశ్వతస్థితి నిచ్చు వానికి నమస్కారము.

టీక : నమః + శివాయ + చ = శివస్వరూపునకు నమస్కారము, శివతరాయ + చ = మిక్కిలి శివములు కలిగించువానికి నమస్కారము.

విశేషము : శివమనగా మంగళకరము. శివతరమనగా శాశ్వతానందము. "నమశ్శివాయ" అను పంచాక్షరీ మంత్రమున కిదియే మూలము.

మంత్రము : నమస్తీర్థ్యాయచ కూల్యాయచ ।
102

తా॥ పుణ్యతీర్థ స్వరూపునకు నమస్కారము. నదీ కూలము లందున్న వానికి నమస్కారము.

టీక : నమః + తీర్థాయ + చ = పుణ్యతీర్థ స్వరూపమునకు నమస్కారము, కూల్యాయచ = నదీతీరముల రూపము వానికి నమస్కారము.

విశేషము : పుణ్యతీర్థములు భగవత్స్వరూపములు. వాని కూలములయందు పుణ్యక్షేత్రములు, శివలింగాదులు, ప్రతిష్ఠ చేయబడును గనుక దైవస్వరూపములు.

మంత్రము : నమః పార్యాయ చావార్యాయచ ।

103

తా॥ ఆవలి యొడ్డున నున్నవానికి నమస్కారము. ఈవలి యొడ్డున నున్నవానికి నమస్కారము.

టీక : నమః + పార్యాయ + చ = పారము నందున్న వానికి నమస్కారము, అవర్యాయచ = అవారము నందున్న వానికి నమస్కారము.

విశేషము : పారమనగా ఆవలియొడ్డు, అవారమనగా నీవలియొడ్డు. పారావారమనగా రెండు కూలముల నడుమ ప్రవాహము. అపార పారావారమనగా సముద్రము.

మంత్రము : నమః ప్రతరణాయ చోత్తరణాయచ ।

104 తా॥ తరింపజేయు మూర్తికి నమస్కారము. మునిగిన వారిని తీరముజేర్చు వానికి నమస్కారము.

టీక : నమః + ప్రతరణాయ + చ = ప్రతరణము చేయించు వానికి నమస్కారము, ఉత్ + తరణాయ + చ = పైకి నుద్ధరించు వానికి నమస్కారము.

విశేషము : ప్రతరణ మనగా నౌక. ఉత్తరణ మనగా నీట మునిగిన వస్తువులను పైకెత్తు గాలమువంటి యంత్రము. అందు మొదటిది దేహమునకును, రెండవది వివేకమునకును సంకేత ములు. దేహము ఆయుః ప్రవాహమును దాటించును. వివేకము సంసారమునుండి యుద్ధరించును.

మంత్రము : నమ ఆతార్యాయ చాలాద్యాయచ ।

105

తా॥ సంపూర్ణముగా తరింపజేయువానికి నమస్కారము. కొక్కెమువంటి గాలము రూపమైన వానికి నమస్కారము.

టీక : నమః + ఆతార్యాయ + చ = సంపూర్ణముగా తరింప జేయు వానికి నమస్కారము, ఆలాద్యాయచ = కొక్కెమువంటి గాలము రూపమైన వానికి నమస్కారము.

విశేషము : ఈ రెండును వరుసగా మోక్ష స్థితిని, సంసార సాగరోత్తరణమును తెలుపును.

మంత్రము : నమశ్శష్ప్యాయచ ఫేన్యాయచ ।

106

తా॥ లేత పచ్చిక రూపమునకు నమస్కారము. నీటిపై నురుగు రూపమునకు నమస్కారము.

టీక : నమః + శష్ప్య + యచ = బాల తృణముల శోభకు

నమస్కారము, ఫేన్యాయచ=ఫేనము రూపమునకు నమస్కారము.

విశేషము : లేతగడ్డి జీవుల కర్మలు మొలకెత్తుటకును, నీటి నురుగు మాయారూపమైన సృష్టి వ్యాప్తికిని సంకేతములు.

మంత్రము : నమస్సికత్యాయచ ప్రవాహ్యాయచ ।

107 తా॥ ఇసుక తిన్నెలపై నున్న వానికి నమస్కారము. ప్రవాహముపై నున్న వానికి నమస్కారము.

టీక : నమః + సికత్యాయ + చ = సైకతములందున్న వానికి నమస్కారము, ప్రవాహ్యాయచ = ప్రవాహమున నున్న వానికి నమస్కారము.

విశేషము : ఇసుక తిన్నెల పైనను జలప్రవాహము పైనను తానున్న గుర్తులను తరంగ రూపమున ముద్రించు వాడు వాయువు. వాయురూపియైన రుద్రునకు నమస్కారమని యర్థము.

మంత్రము : నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ ।

108 తా॥ తేమ నేల యందున్న వానికి నమస్కారము. జన సంకులమైన మార్గమున నున్న వానికి నమస్కారము.

టీక : నమః + ఇరిణ్యాయ + చ = తడినేల యందున్న వానికి నమస్కారము, ప్రపథ్యాయచ = ప్రపథము నందున్న వానికి నమస్కారము.

విశేషము : ఇర అనగా జలము. ఇరిడి అనగా తడిసిన నేల. ప్రపథము అనగా జనులతో నిండియున్న మార్గము.

మంత్రము : నమః కిగ్ం శిలాయచ క్షయణాయచ ।

109 తా॥ సన్నని గులకరాళ్ళ ప్రదేశము రూపమైన వానికి నమస్కారము. వాసయోగ్యమైన ప్రదేశము గల వానికి నమస్కారము.

టీక : నమః + కింశిలాయ + చ = సన్నని శిలలుగల ప్రదేశ రూపమునకు నమస్కారము, క్షయణాయ + చ = వాస యోగ్యమైన ప్రదేశము గలవానికి నమస్కారము.

విశేషము : ఇంతవరకు రుద్రుడు అనేక విధముల ప్రదేశముల రూపమున నంతర్యామిగా వర్ణింపబడెను.

మంత్రము : నమః కపర్దినే చ పులస్తయేచ ।

110 తా॥ జడలచుట్ట గలవానికి నమస్కారము. భక్తుల యెదుట నిలబడువానికి నమస్కారము.

టీక : నమః + కపర్దినే + చ = కపర్దము (జటాజూటము) గల వానికి నమస్కారము, పులస్తయే + చ = పురస్థితి (ఎదుట నిలబడుట) కలవానికి నమస్కారము.

మంత్రము : నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ ।

111 తా॥ గొడ్లపాకలలో నుండువానికి, గృహములలో నుండు వానికి నమస్కారము.

టీక : నమః + గోష్ఠ్యాయ + చ = గోష్ఠము నందున్న వానికి నమస్కారము, గృహ్యాయ + చ = గృహమునందున్న వానికి నమస్కారము.

మంత్రము : నమస్తల్ప్యాయ చ గేహ్యాయచ ।

112

తా॥ పాన్పుపైన పవళించిన మూర్తికి నమస్కారము. మేడలో నివసించు మూర్తికి నమస్కారము.

టీక : నమః + తల్ప్యాయచ = తల్పమునందున్న వానికి నమస్కారము, గేహ్యాయచ = గేహమునందున్న వానికి నమస్కారము.

మంత్రము : నమః కాట్యాయచ గహ్వరేష్ఠాయ చ ।

113

తా॥ ముండ్లపొదల యందు తిరుగుచున్న మూర్తికి నమస్కారము. కొండగుహలు మున్నగు ప్రదేశములందు తిరుగుచున్న మూర్తికి నమస్కారము.

టీక : నమః + కాట్యాయ + చ = ముండ్లపొదలందున్న వానికి నమస్కారము, గహ్వరేష్ఠాయ + చ = గుహలతో నిండిన ప్రదేశము లందుండువానికి నమస్కారము.

విశేషము : ఇందు ముండ్లతీగెల నడుమ నివసించు క్రిమి కీటకాదుల రూపములును, గుహలయందు నివసించు పులులు, సింహములు మొదలగు రూపములును ధ్యానింపబడినవి.

మంత్రము : నమో హ్రదయ్యాయచ నివేష్ప్యాయచ ।

114

తా॥ లోతైన మడుగులో నున్నవానికి నమస్కారము. మంచునీటి యందున్న మూర్తికి నమస్కారము.

టీక : నమః + హ్రదయ్యాయ + చ = లోతైన మడుగు అందున్న వానికి నమస్కారము, నివేష్ప్యాయ + చ = మంచు నీటి యందున్న వానికి నమస్కారము.

విశేషము : ఇందు వరుసగా చేపలును, మంచుతో నిండిన సముద్రములయం దీదు మహాజలచరములును స్తుతింపబడినవి.

మంత్రము : నమః పాగ్ంసవ్యాయచ రజస్యాయచ ।

115

తా॥ మెత్తని ధూళియందున్న జీవుల రూపమునకు నమస్కారము. గరుకైన దుమ్మునందుండు రూపములకు నమస్కారము.

టీక : నమః + పాంసవ్యాయ + చ = పాంసువుల యందున్న జీవులకు నమస్కారము, రజస్యాయ + చ = రజస్సుల యందున్న జీవులకు నమస్కారము.

విశేషము : పాంసువు అనగా మెత్తని ధూళి. అందుండు నవి సూక్ష్మజీవులు. రజస్సులనగా స్థూలరేణువులు. వాని యందు స్థూలములైన క్రిములుండును. మరియు అనేక ఖనిజములు, రసాయనిక పదార్థములు, వీని ధర్మములు ఇందు స్మరింపబడిన మూర్తులు.

మంత్రము : నమః శుష్క్యాయచ హరిత్యాయచ ।

116

తా॥ ఎండిపోయిన గడ్డి ప్రదేశముల కధిపతికి నమస్కారము. పచ్చ పచ్చగా పెరిగిన పచ్చికబయళ్ళ కధిపతికి నమస్కారము.

టీక : నమః + శుష్క్యాయ + చ = శుష్కించిన వస్తువుల కధిపతికి నమస్కారము, హరిత్యాయ + చ = హరితవర్ణము (ఆకు పచ్చ రంగు) గల జీవుల కధిపతికి నమస్కారము.

విశేషము : ఎండుగడ్డిని, పచ్చ గడ్డిని గూడ పశువుల కాహారముగా నేర్పరచు రుద్రునకు నమస్కారము. మరియు నెండిన కాయలు, పండ్లు, విత్తనములు కొందరి కాహార మగుచున్నవి. ఆకులు, పచ్చికాయలు, పండ్లరసములు కొందరి కాహార మగుచున్నవి. ఇన్నిటిని నిర్వహించు ఓషధీస్వరూపునకు నమస్కారము.

మంత్రము : నమో లోప్యాయ చోలప్యాయచ ।

117

తా॥ ఏమియు మొలువని కఠిన ప్రదేశములం దంతర్యామికి నమస్కారము. గడ్డి మొదలైనవి మొలుచు మృదు ప్రదేశములకు నమస్కారము.

టీక : నమః + లోప్యాయ + చ = కఠినములైన బండల ప్రదేశమునకు నమస్కారము, ఉలప్యాయచ = గడ్డి మొలుచు ప్రదేశములకు నమస్కారము.

మంత్రము : నమ ఊర్మ్యాయచ సూర్మ్యాయచ ।

118

తా॥ అలలతో కూడిన ప్రదేశములకు నమస్కారము. పెద్ద తరంగములతో నిండిన ప్రదేశములకు నమస్కారము.

టీక : నమః + ఊర్మ్యాయ + చ = అలలతో నిండిన నదులు మొదలగు మూర్తులకు నమస్కారము, సు + ఊర్మ్యాయచ = పెద్ద అలలతోనిండిన సముద్రము మొదలగు మూర్తులకు నమస్కారము.

మంత్రము : నమః పర్ణ్యాయచ పర్ణశద్యాయచ।

119 తా॥ చెట్ల యాకుల రూపమునకు నమస్కారము. ఆకుల గుబురుల రూపమునకు నమస్కారము.

టీక : నమః + పర్ణ్యాయ + చ = ఆకుల రూపములకు నమస్కారము, పర్ణశద్యాయ + చ = ఆకుల గుబురుల రూపమునకు నమస్కారము.

మంత్రము : నమోఽపగురమాణాయ చాభిఘ్నతేచ।

120 తా॥ ఆయుధముల నెక్కుపెట్టుచున్న రూపములకు నమస్కారము. శత్రువులను చంపుచున్న రూపమునకు నమస్కారము.

టీక : నమః + అవగురమాణాయ + చ = ఆయుధము లెక్కుపెట్టుచున్న వానికి నమస్కారము, అభిఘ్నతేచ = అభిముఖుడై శత్రువులను చంపుచున్నవానికి నమస్కారము.

మంత్రము : నమ ఆఖ్ఖిదతేచ ప్రఖ్ఖిదతేచ।

121 తా॥ శ్రమ పడువాని రూపమునకు నమస్కారము. శ్రమ పెట్టువాని రూపమునకు నమస్కారము.

టీక : నమః + అఖ్ఖిదతే + చ = శ్రమపడువానికి నమ

స్కారము, ప్రఖిదతే + చ = శ్రమపెట్టువానికి నమస్కారము.

మంత్రము : నమో వః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః ।
122

తా॥ సంపదలను వెదజల్లువారును, దేవతలకు హృదయ స్వరూపులైనవారును అగు మీకు నమస్కారము.

టీక : నమః + వః కిరికేభ్యః = సంపదలను వెదజల్లు మీకు నమస్కారము, దేవానాం హృదయేభ్యః = దేవతల హృదయముల స్వరూపమైన మీకు నమస్కారము.

విశేషము : దేవతలు మంత్రాత్మకులనియు, పరోక్షప్రియులనియు వేదము చెప్పుచున్నది. దేవతా హృదయములనగా మంత్ర స్వరూపములైన, ఉచ్చారణ స్వరూపములైన స్తుతి రూపములు. ఉదాహరణ : ఆదిత్య హృదయము, లక్ష్మీ హృదయము మున్నగునవి.

మంత్రము : నమో విక్షీణకేభ్యో నమో విచిన్వత్కేభ్యః ।
123

తా॥ తరుగకుండ పుట్టుచుండు రూపములకు నమస్కారము. సంపదలను కూడబెట్టునట్టి మూర్తులకు నమస్కారము.

టీక : నమః + విక్షీణకేభ్యః = క్షీణము లేనివారికి నమస్కారము, నమః + విచిన్వత్కేభ్యః = విశేషముగా సంచయము చేయువారికి నమస్కారము.

విశేషము : జీవుల దేహములు క్షీణించుచున్నను అందు

పనిచేయు దేవతలు నశింపరు. కనుక తరుగనివారు. కూడబెట్టునట్టి దేవతామూర్తులనగా దేహాది ధాతువులను కల్పించువారు.

మంత్రము : నమ ఆనిర్హతేభ్యో నమ ఆమీవత్కేభ్యః ।

124

తా॥ పాపములను నిశ్శేషముగ పోగొట్టువారికి నమస్కారము. కొలతల కందని రూపములు గలవారికి నమస్కారము.

టీక : నమః + అనిర్హతేభ్యః = పాపములను నిశ్శేషముగ హతము చేయువారికి నమస్కారము, నమః + ఆమీవత్కేభ్యః = అమేయ మూర్తులైన వారికి నమస్కారము.

విశేషము : పాపము పోగొట్టువారు బుద్ధి, వివేకము మున్నగు మూర్తులు. వీరికి భౌతిక కక్ష్యలోని పరిమాణాదు లుండవు.

## (ఫలశ్రుతి రూప మంత్రములు)

మంత్రము : ద్రాపే అన్ధసస్పతే దరిద్రన్నీలలోహిత ।

125

తా॥ రాక్షసులను నశింప జేయువాడా ! ఆహారమున కధిపతి అయినవాడా ! నీదియని యేమియు లేనివాడా ! నల్లని యెఱ్ఱని రూపములు కలవాడా !

టీక : ద్రాపే = ద్రవింప జేయువాడా (రాక్షసులను రక్తపు టేరులుగ చేయువాడా), అంధసస్పతే = ఆహారమున కధిపతియైనవాడా ! దరిద్రన్ = నీదియని ఏదియు లేనివాడా ! నీలలోహిత = నీలము లోహితము అగు రంగులు కలవాడా !

విశేషము : అన్నమున కధిపతి యనగా నొకజీవి నింకొక జీవికి ఆహారముగా నేర్పరచుటకై ఆ జీవుల రూపము ధరించువాడు. మరియు ఆహారము జీర్ణమగుట పుష్టి నిచ్చుటకు కారణములైన ధర్మములను సృష్టియందు స్థాపించువాడు. "అన్నము బ్రహ్మమని తెలియవలెను" అని వేదము చెప్పుచున్నది. "నేను వైశ్వానరు డనబడు జఠరాగ్ని స్వరూపముగా జీవుల దేహము నాశ్రయించి ప్రాణాపానముల సంయోగ మూర్తినై నాలుగు విధములైన యన్నములను పాకమునకు తెచ్చుచున్నాను" అని భగవద్గీతలో చెప్పబడెను.

మంత్రము : ఏషాం పురుషాణాం ఏషాం పశూనాం మాభే
126 ర్మారోమో ఏషాం కించనామమత్ ।

తా॥ ఈ జీవులను, ఈ పశువులను మృత్యువుతోను, రోగముతోను భయపెట్టక, ఏడిపించక కాపాడుము.

టీక : ఏషాం = వీరికి, పురుషాణాం = జీవులకు, పశూనాం = పశువులకు, మా అరః = నాశము కలిగింపకుము, మా అనుమత్ = రోగము కలుగనీయకుము, మాభేః = భయపెట్టకుము, మారో = రోదింప జేయకుము.

విశేషము : ఇచట పురుషులనగా జీవులు. పురము లేక దేహము ధరించువారు. స్త్రీలు కాక పురుషులని యర్థము కాదు. జీవులుకాక పశువులు వేరుగా చెప్పబడుటచే పాశములచే బంధింపబడిన ఇంద్రియములు, వాని ప్రవృత్తులు అని యర్థము. అకాల మరణములు, వ్యాధులు కలుగునట్టి మార్గమునను,

భయము దుఃఖము కలుగునట్టి మార్గమునను పోనీయక కాపాడుమని యర్థము.

మంత్రము : యా తే రుద్రశివా తనూశ్శివా విశ్వాహ భేషజీ।
127 శివారుద్రస్య భేషజీ తయానో మృడ జీవసే ॥

తా॥ మంగళకరమైన నీ రూపము మాకు అన్ని దినముల యందును సర్వరోగ హరమగును గాక! అశుభములను తొలగించు వైద్యమైన నీ రూపముచే మమ్ములను జీవింపచేసి సుఖింప జేయుము.

టీక : రుద్ర=రుద్రుడా! శివా=శుభకరమైనది, విశ్వాహ భేషజీ=అన్ని దినముల యందును రోగహరమైనది, రుద్రస్య శివా భేషజీ=రుద్రుని మంగళకరమైన శక్తి రూపమైన వైద్యముగా, తే=నీ యొక్క, యా తనుః=ఏ దేహము గలదో, తయా=ఆ విశ్వరూపమైన మూర్తిచే, నః=మమ్ము, జీవసే=జీవింప జేయుటకై, మృడ=సుఖింపజేయుము.

విశేషము : మంగళకరమైన శివుని రూపమనగా పైన వర్ణింపబడిన రూపము అన్నింటికిని స్థానమగు విశ్వరూపము. రుద్రుని శక్తియనగా పై జెప్పబడిన మూర్తులలో ప్రాణములు, చేష్టలు మున్నగు ప్రవర్తనముల నిచ్చు శక్తి. విశ్వమందలి సర్వరూపములను రుద్రుని సగుణ పరబ్రహ్మ రూపములుగా ధ్యానించుట వలన సంతోషము, సుఖము, ఆయురారోగ్యాదులు కలుగునని యర్థము.

మంత్రము : ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే
128 క్షయద్వీరాయ ప్రభరామహే మతిమ్।

యథా నశ్శమసద్ద్విపదే చతుష్పదే
విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురమ్॥

తా॥ రెండు పాదములు ధరించిన మనుష్యులకు, నాలుగు పాదములు ధరించిన జంతువులకు శాంతి కలుగునట్లనుగ్రహింపుము. ఈ గ్రామము నందు సమస్త ప్రాణులకును చక్కని పుష్టియు, ఆపదలు లేని జీవితమును అనుగ్రహింపుము. మమ్మిట్లనుగ్రహించుట కొరకు సమర్థుడవు, జటాజూటధారివి, శత్రునాశంకరుడవు అయిన నిన్ను రుద్రమూర్తిని బుద్ధియందు నిలిపి నిరంతరము ధారణ చేయుదుము.

టీక : యథా = ఏ విధముగ, నః = మాకు, ద్విపదే = రెండు పాదములుగల నరులకు, చతుష్పదే = చతుష్పాత్తులకు, శం + అసత్ = శాంతి కల్గునో, అస్మిన్ + గ్రామే = ఈ గ్రామము నందు, విశ్వం = సర్వ జీవరాశుల సమూహము, పుష్టం = పోషింపబడినదిగా, అనాతురమ్ = ఆపదలు లేనిదిగా, అసత్ = కలుగునో, తథా = ఆ విధమున, వయం = మేము, తవసే = సమర్థత గలుగువాని కొరకు, కపర్దినే = జటాజూటము గలవాని కొరకు, క్షయత్ + వీరాయ = శత్రునాశము చేయువానికొరకు, రుద్రాయ = రుద్రుని కొరకు, ఇమాం మతిం = ఈ బుద్ధి బలమును, ప్రభరామహే = ధరించుచున్నాము.

విశేషము : రుద్రుని కొరకు బుద్ధిబలమును ధరించుట యనగా బుద్ధియందు రుద్రుని నిలిపి ధారణ చేయుట.

మంత్రము : మృడానో రుద్రోతనో మయస్కృధి
129 క్షయద్వీరాయ నమసా విధేమతే।

యచ్ఛంచ యోశ్చ మను రాయ జే పితా
తదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ ॥

తా॥ ఓ రుద్రమూర్తీ! మాకు సుఖానుభూతి నిమ్ము, మరియు ఆనందానుభూతి కూడ కలుగజేయుము. శత్రు నాశంకరుడవగు నీకు నమస్కరించెదము. మాకు తండ్రివి, పరి పాలకుడవుగా నుండి దుఃఖము లేని సుఖమును యజ్ఞార్థ జీవితము నందు కలిగింపుము. నీ నీతి పథమునందు మేము సుఖ మనుభ వింతుము గాక!

టీక : రుద్ర=రుద్రుడా ! వః = మమ్ములను, మృడ = సుఖపెట్టుము, ఉత=మరియు, నః = మాకు, మయః = ఆనంద పారవశ్యమును, కృధి=కలిగింపుము, క్షయత్ + వీరాయ = శత్రువులు నశించు రూపమైన, తే=నీకు, నమసా=నమస్కార ముచే, విధేమ=విధి విధానము లాచరించెదము, పితా = పాల కుడు, తండ్రి, మనుః = ప్రజాపతి, యః + చ + శం + చ = శాంతి అను పేరుగల వస్తువేది కలదో, తత్ = దానిని, ఆయజే = పరిపూర్ణ యజ్ఞ స్వరూపమున, తవ = నీయొక్క, ప్రణీతౌ = చక్కని నీతి పథమునందు, అశ్యామ = అనుభవింతుముగాక !

విశేషము : సుఖపెట్టుట, ఆనంద మనుభవింప జేయుట వేరుగా చెప్పబడినవి. ఇహలోక సుఖము, మోక్షానందము అని యర్థము.

మంత్రము : మానో మహాన్తముతమానో అర్భకం ।
130 మాన ఉక్షన్తముతమాన ఉక్షితమ్ ।

మానోవధీః పితరం మోత మాతరం ।
ప్రియామానస్తనువో రుద్రరీరిషః ॥

తా॥ రుద్రా! మా పెద్దవారిని, మాలో పిన్నలను, దుర్బ లులను, యువక వయస్సువారిని, గర్భస్థులగు శిశువులను బాధ లేకుండునట్లు కాపాడుము. మా తల్లిదండ్రులను మాకు ప్రేమ పాత్రులను, ధృఢ శరీరులను చేసి కాపాడుము.

టీక : రుద్ర = రుద్రుడా ! నః = మా యొక్క, మహాన్తం = పెద్దవానిని, ఉత = మరియు, నః అర్భకం = మా శిశువును, నః ఉక్షన్తం = మా యువక వయస్సువానిని, ఉతఉక్షితం = మరియు గర్భస్థ శిశువును, నః పితరం = మా తండ్రిని, ఉత మాతరం = మా తల్లిని, నః ప్రియాః = మా ప్రియజనులను, మావధీః = వధింపకుము, తనువః = శరీరములను, మారీరిషః = హింసలు పొందచేయకుము.

విశేషము : వధింపకుము అనగా అకాల మరణములపాలు చేయకుము. హింసింపకుము అనగా రోగాదులు కలుగ నీయకుము.

మంత్రము : మానస్తోకే తనయే మాన ఆయుషి
131 మానో గోషుమానో అశ్వేషు రీరిషః ।
వీరాన్మానో రుద్రభామితో
వధీర్హవిష్మన్తో నమసా విధేమ తే ॥

తా॥ మా పుత్రులను, రాబోవు తరములను కాపాడుము. ఆయుర్దాయములను కాపాడుము. గోవులను, అశ్వములను

బాధింపకుము, నీకు మేము కోపము కలిగించు పనులు చేసినను మా గణములను బాధింపకుము. మేము నీకు హవిస్సుల నర్పించి నమస్కరించెదము.

టీక : నః తోకే = మా ముందు తరములయెడల, తనయే = సంతతియెడల, నః ఆయుషి = మా ఆయుర్దాయ విషయమున, నః గోషు = మా గోవుల విషయమున, నః అశ్వేషు = మా గుఱ్ఱముల విషయమున, మా రీరిషః = హింసను తలపెట్టకుము, భామితః = ప్రకాశించిన కోపము గలవాడవై, నః వీరాన్ = మా వీరులను, మా రీరిషః = హింసింపకుము, హవిష్మన్తః = హవిస్సులు గలవారమై, వయం = మేము, నమసా = నమస్కారముచే, తే విధేమ = నీకు విధేయుల మయ్యెదము.

విశేషము : హవిస్సులనగా యజ్ఞ ద్రవ్యములు.

మంత్రము : ఆరాత్తే గోఘ్న ఉతపూరుషఘ్నే
132 క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు ।
రక్షా చనో అధిచ దేవ బ్రూహ్య
ధాచన శ్శర్మ యచ్ఛ ద్విబర్హాః ॥

తా॥ గోవులను, మనుష్యులను, పరివారమును సంహారము చేయు నీ భయంకర రూపము మమ్ము సమీపింప కుండును గాక ; నీ శాంత స్వరూపమే మా కభిముఖమై కాపాడు గాక ! మేము అధికులమని కీర్తి వహించునట్లు చేయుము. ఇహ పరలోకముల యందలి సౌఖ్యములను మాకు కలుగజేయుము.

టీక : గోఘ్నే = గోవులను చంపువానియెడల, ఉత = మరియు, పూరుషఘ్నే=మనుష్యులను చంపువాని యెడల, క్షయద్వీరాయ = పరివారమును చంపువాని యెడల, తేరూపం = అట్టి నీ రూపము, ఆరాత్ = దూరదూరముగా, అస్తు = అగుగాక : తేసుమ్నం = నీ సుఖకరమైన స్వరూపము, అస్మే అస్తు = మా యందుండు గాక ! నః రక్ష = మమ్ము కాపాడుము, అధిబ్రూహి = మే మధికులమని చాటి పలికెదవు గాక ! అధిచ = మరియు, నధికముగా, ద్విబర్హాః = రెండు విభాగముల యందు (రెండు లోకముల యందును), శర్మ = శాంతియుతమైన సుఖమును, త్వం నః = నీవు మాకు, యచ్ఛ = దానము చేయుము.

మంత్రము : స్తుహిశ్రుతం గర్తసదం యువానమ్ ।
133 మృగ న్న భీమ ముపహత్ను ముగ్రమ్ ॥

తా॥ వినబడునట్టి ప్రభావము గలవానిని (ప్రసిద్ధుడగు వానిని), గోతిలో దాగియున్నట్లు అంతర్లీనుడై అప్రసిద్ధుడైనట్లున్న వానిని (అంతర్యామిని, హృదయము నందున్న వానిని), నిత్యము యువకుడై యున్నవానిని సంహరించుట యందు భయంకరుని, మృగరాజగు సింహమువంటి రుద్రుని స్తుతింపుము.

టీక : శ్రుతమ్ = వినబడు వానిని, గర్తసదం = గోతిలో కూర్చున్న వానిని, యువానమ్ = యౌవన వయస్సు కలవానిని, మృగమ్ + న + భీమమ్ = సింగమువలె భీకరుని, ఉపహత్నుమ్ = చంపుటకు, ఉగ్రమ్ = భయంకరాకారము దాల్చిన వానిని, స్తుహి = స్తుతింపుము (ప్రస్తావింపుము).

విశేషము : శ్రుతుడు అనగా వినబడువాడు, శబ్దబ్రహ్మ స్వరూపుడు. గర్తసదుడు అనగా చోటులో ప్రతి బిందువునందును అవ్యక్తముగా దాగియున్నవాడు. మరియు హృదయము లందు దాగియున్నవాడు. సింహమువలె భయంకరుడనగా పరాక్రమాదుల స్వరూపము. చంపుట యందు ఉగ్రుడు అనగా మృత్యువు యొక్క స్వరూపము. ఈ మంత్రము వలన శత్రువులపై జయము, మృత్యుభీతి తొలగుట, గుండె జబ్బులు, చెవి జబ్బులు తొలగుట జరుగును. స్తుతింపుమని రుద్రుని సంబోధించుట వలన భక్తుడు గూడ రుద్రరూపుడుగా భావింపబడుచున్నాడు.

మంత్రము : మృడా జరిత్రే రుద్ర స్తవానో
134 అన్యంతే అస్మన్నివపన్తు సేనాః ॥

ఓ రుద్రా! మాచే స్తుతింపబడువాడవై ఈ యశాశ్వతమైన శరీరమునందు సుఖ స్వరూపుడవై వసింపుము. నీ సేనలు మాయందు అన్యభావనగల శత్రువులను ఖండింతురు గాక!

టీక : రుద్ర = రుద్రుడా! స్తవానః = స్తుతింపబడుచున్న వాడవై, జరిత్రే = జీర్ణమైపోవు లక్షణముగల మా అస్తిత్వమందు (అశాశ్వతమైన శరీరమందు), మృడ = సుఖముగా నుండుము, తే సేనాః = నీ సేనలు, అస్మత్ = మాకన్న, అన్యమ్ = ఇతరుని, వివపన్తు = నరికివేయుదురు గాక!

విశేషము : పాంచభౌతికమైన దేహము అశాశ్వతము. అందున్న జీవుడు రుద్రుని స్తుతించుచున్నచో రుద్రుడే అందు సాన్నిధ్యము చేసి జీవితమును సుఖవంతముగా చేయును.

అతనికన్న వేరొకటి యున్నదను భావములే శత్రువులు. వాని నతడు ఖండించును.

మంత్రము : పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు।
135 పరిత్వేషస్య దుర్మతి రఘాయోః ॥

తా॥ రుద్రుని ఆయుధము మమ్ములను అన్ని దిక్కుల యందును ప్రయోగించును గాక ! కోపించువాడును, పాపబుద్ధియు, హింసాబుద్ధియు, దుర్బుద్ధియు అగు రూపములు గూడ మాకు రుద్రుని రూపములే ! కనుక అట్టి రుద్రుడు మమ్ములను విడిచి పెట్టును గాక ! (హింసాది దుర్బుద్ధులు కలవారితో మాకు సంబంధము కలుగకుండును గాక !)

టీక : రుద్రస్య = రుద్రునియొక్క, హేతిః = ఆయుధము, నః = మమ్ములను, పరివృణక్తు = అంతటను విడిచిపెట్టును గాక ! త్వేషస్య = ద్వేషించిన వానియొక్క, అఘాయోః = పాపబుద్ధి గలవానియొక్క, రుద్రస్య = రుద్రునియొక్క, దుర్మతిః = చెడ్డ సంకల్పము, నః = మమ్ము, పరివృణక్తు = అంతటను విడిచి పెట్టును గాక !

విశేషము : లోకమున పాపబుద్ధి గలవారు, క్రూరులు, హింసాత్మకులు కలరు కదా ! వారును రుద్రుని ఆయుధములవంటి రూపములే ! వారివలన రుద్రోపాసకులకు కామక్రోధముల పరీక్షలు జరుగును. వారిని గూడ రుద్రరూపములుగా ధ్యానించుట వలన ఆ రూపములతో ఘర్షణ కలుగకుండ వారికి దూరముగా మా జీవితములు గడుచుగాక !

మంత్రము : అవస్థిరా మఘవద్భ్య స్తనుష్వ ।
136 మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ ॥

తా॥ నీకు యజ్ఞార్థములను సమర్పించు మాయందు నీ యుగ్ర సంకల్పమును ప్రసరింప జేయకుము. మాకును, మా పుత్రులకును, వారి పుత్రులకును సంతోష మొసగి కోరికలు తీర్పుము.

టీక : స్థిరా = స్థిరమైనది (రుద్రసంకల్పము), తామ్ = దానిని, మఘవద్భ్యః = యజ్ఞార్థముగా అన్నపానీయాదుల పేర సమర్పించు హవిస్సులు కలవారినుండి, అవతనుష్వ = తొలగింపుము, మీఢ్వః = కోరికల రూపమున ఆహారాదులకై వర్షించువాడా ! తోకాయ = ముందు తరముల కొరకు, తనయాయ = వారి సంతతికొరకు, మృడయ = సుఖము నొసగుము.

విశేషము : జీవులను రుద్రరూపములుగా అర్చించువారు ఇతరులకు దయతో అన్న పానీయాదుల నొసగుదురు. యజ్ఞార్థముగా సమర్పింతురు. కనుక అవియే హవిస్సులు. భుజించువారి ఆకలియే అగ్నిహోత్రుడు. జీవులే రుద్రరూపులు. అట్లు అన్నదానాది యజ్ఞములు చేయువారియెడల రుద్రుడు తన ఉగ్ర సంకల్పములను ప్రసరింపజేయ కుండుగాక ! మేము అట్టి యజ్ఞములు చేయువారము అగుదుముగాక ! దానికొరకై అన్నపానీయాదులు అవశ్యకము గనుక నీవు చక్కగా వర్షింతువు గాక ! మేము తరతరములుగా ఈ రుద్రదీక్షను నిర్వహించు చున్నంత వరకు మా బిడ్డలను, వారి బిడ్డలను ఈ దీక్షకొరకై కాపాడుదువు గాక ! ఈ మంత్రముతో జప, ధ్యాన పారాయణము చేయుట

వలన సకాల వర్షములు, సంతతి లేనివారికి సంతతి, పంటలు లేనివారికి పంటలు కలుగును. ఈ ఫలము చక్కగా సిద్ధించుటకు అన్నదానము వ్రతముగా చేయవలెను.

మంత్రము : మీఢుష్టమ శివతమ శివోనస్సుమనా భవ।
137
తా॥ మేఘరూపుడవై కోరికలను మించిన ఫలములను వర్షించువాడా! మంగళ స్వరూపుడా! మాయందు నీవు శుభ కరుడవు, మంచి మనస్సు గలవాడవు కమ్ము.

టీక : మీఢుష్టమ = మిక్కిలిగా వర్షించువాడా!, శివతమ = ఉత్తమ శుభస్వరూపుడా!, నః = మాకు, శివః = శుభకరుడవు, సుమనాః = మంచి మనస్సుగలవాడవు, భవ = అగుము.

విశేషము : మేఘముల రూపమున రుద్రుడు సకాల వర్షము లిచ్చుటవలన పంటలు పుష్కలమై ప్రజల కోరికలు ఇతోధికముగా తీరును. వారి శాంతి జీవనమే తన సర్వాంతర్యామిత్వముగా శివుడందరిలో వసించును. ఒకరియం దొకరు స్నేహ భావముల నుపాసించు చున్నంత వరకు రుద్రుడు స్నేహస్వరూపుడై సన్నిధి చేయును.

మంత్రము : పరమే వృక్ష ఆయుధం విధాయ కృత్తిం వసాన
138 ఆచర పినాకం బిభ్రదాగహి॥

తా॥ నీ అయుధములను చెట్టుపైన నుంచి చర్మాంబర ధారివై అందరిలో సంచరింపుము. పినాకధారివై మాయందు నడచుచుండుము.

టీక : ఆయుధమ్ = ఆయుధమును, పరమే = మిక్కిలి యున్నతమైన, వృక్షే = చెట్టునందు, నిధాయ = ఉంచి, కృత్తిమ్ = చర్మమును (పులిచర్మమునో, ఏనుగుచర్మమునో), వసానః = వస్త్రముగా ధరించి, ఆ + చర = విస్తారముగా సంచారము చేయుము, పినాకమ్ = నీ ధనుస్సు, బిభ్రత్ = ధరించుచు, ఆగహి = రమ్ము.

విశేషము : శాంతి కాముకులమైన మాలో నీవు అంతర్యామివై చరించుచున్నపుడు నీ ఆయుధములను ఉపయోగింపకుము. ఉత్తమాదర్శము అను చెట్టుమీద ఆయుధములను దాచుకొని మాలో శాంతుడవై విహరింపుము. ఎవరైనా మమ్మెదిరించినచో నీ పినాకమును ధరించి మాలో ముందు నడువుము.

మంత్రము : వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః । యాస్తే
139 సహస్రగ్ం హేతయో౽న్యమస్మన్నివపన్తుతాః॥

తా॥ విశేషముగా సంపదలను వెదజల్లుచు ఎఱ్ఱదనముతో నొప్పువాడవై యున్న నీకు నమస్కారము. వేనవేల సంఖ్యలో నున్న నీ ఆయుధములు అన్యులను ఖండించును గాక!

టీక : వికిరిద = విశేషముగా సంపదలను వెదజల్లి దానము చేయువాడా , విలోహిత = విచిత్రములైన ఎఱ్ఱని రంగులుగల సంధ్యా స్వరూపుడా!, భగవః = ఐశ్వర్యాది మహిమలు గల వాడా, సృష్టి స్థితి లయముల కధిపతీ, తే = నీకు, సహస్రమ్ = వేల సంఖ్యగల, హేతయః = ఆయుధములు, యాః = ఏవి కలవో, తాః = అవి, అస్మత్ + అన్యమ్ = మా కితరులను, నివపన్తు = ఖండించును గాక!

విశేషము : ఉభయ సంధ్యాస్వరూపుడై, కాలాత్మకుడైన రుద్రుడు జీవులకు దినచర్యల, వృత్తుల రూపమున సంపదలను గుప్పిళ్ళతో వెదజల్లుచున్నాడు. వర్షాది ఋతువుల రూపమున సస్యాది సంపదలను పంచి పెట్టుచున్నాడు. అట్టి రుద్రుని సూర్యాత్మకములైన కిరణములు మాలోని అన్యబుద్ధులు అను శత్రువులను నశింపజేయునుగాక ! ఈ మంత్రానుష్ఠానము వలన అన్నపానాది సంపదలు, వృత్తి ఉద్యోగాదులు సులభ సాధ్యము అగును. బంధుమిత్రాదులను వేరుగా చూచు నీచబుద్ధి తొలగును.

మంత్రము : సహస్రాణి సహస్రధా బాహ్వోస్తవ హేతయః।
140 తాసామీశానో భగవః పరాచీనా ముఖాకృధి ॥

తా॥ ఓ భగవంతుడా ! నీ ఆయుధములు వేనవేలుగా వేల విధములుగా నొప్పుచున్నవి. వాని వాడియైన మొనలు మా పైపునకు రాకుండ తొలగిపోవునట్లు చేయుము.

టీక : భగవః = భగవానుడా, తవ = నీ యొక్క, బాహ్వోః = చేతులయందు, హేతయః = ఆయుధములు, సహస్రధా = వేన వేలు విధములుగా, సహస్రాణి = వేన వేలు సంఖ్యలుగా నున్నవి, తాసామ్ = వానియొక్క, ముఖాః = మొనలను, పరాచీనాః = మరియొక దిక్కునకు తిరిగినవిగా, కృధి = చేయుము.

విశేషము : కాలరూపుడైన రుద్రుని ఆయుధములు అనేక సంకల్పములుగా జీవులలో వేనవేలుగా పుట్టుచుండును. సూర్యస్వరూపుడైన రుద్రుని బాహువులు వేనవేలు కిరణములుగా జీవుల రూపమున పుట్టుచుండును. ఒక్కొక్కనికి కలుగు సంకల్పము

అన్నియు వాని చుట్టును ఆయుధములై యుండును. ఒకరి సంకల్పము లొకరికి బాధాకరములై గ్రుచ్చుకొనకుండునట్లు అనుగ్రహింపుము. ఈ మంత్రమున 'సహస్ర' అను పదము జీవులలో సంకల్పములు ధరించిన రుద్రమూర్తిగా నుపదేశింప బడినది. అందు 'సహ, హస' అనునవి ఉచ్ఛ్వాస, నిశ్వాస ముల సంకల్పములై సోహం, హంసో అను మంత్రములుగా దేవుని స్తుతించుచుండును. రేఫము అగ్ని స్వరూపుడుగ ప్రాణమై వర్తించును, కంఠనాదముగా వెలువడును. పురుషసూక్తము ఈ మంత్రోపదేశముతో ప్రారంభమగును. మంత్రతత్త్వజ్ఞులు దీనిని సుదర్శన మంత్రమందురు. దీని అంచులు స్వ, పర బుద్ధిగల వారి నడుమ నొకరి సంకల్పములుగా నింకొకరిని బాధించును. కనుక అన్యబుద్ధి లేకుండుటచే ఈ అంచులు గ్రుచ్చుకొనక తప్పి పోవును.

మంత్రము : సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్।
141 తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి ॥

తా॥ ఈ భూమి నాశ్రయించి రుద్రమూర్తులు సహస్ర సంఖ్యలు గలవారై యున్నారు. వేల విధములుగా తిరుగు చున్నారు. వారివారి ధనుస్సులను నీవు వేల వేల యోజనములు గల ప్రదేశమునందు అల్లెత్రాడు వదలించి యుంచుచున్నావు.

టీక : సహస్రాణి = వేల సంఖ్య గలవారు, సహస్రశః = వేల విధములుగా నున్నవారు, యే రుద్రాః = ఏ రుద్రులు (కలరో), తేషామ్ = వారియొక్క, ధన్వాని = ధనుస్సులను, సహస్రయోజనే = వేయి ఆమడల వరకు, అవతన్వసి = అల్లెత్రాడు విడిపించి యుంచుచున్నాము.

విశేషము : భూమి మీద రుద్రులు వేన వేల రూపములతో నున్నారు. (జీవుల రూపముతో నున్నారు) వేనవేలు తరగతులలో నున్నారు (కొందరు నాయకులు, కొందరు రక్షక భటులు, కొందరు వివిధ వృత్తులలో సుఖించు ప్రజలుగా నున్నారు. నాయకులకు అధిదేవతలుగా గణపతులను ప్రమథులున్నారు. రక్షణాధికారుల కధిదేవతలుగా భయంకరములైన భూత గణము లున్నారు. వృత్తులలో సుఖించువారి కధిదేవతలుగా నందీశ్వరుని గణము లున్నారు) వారందరును రుద్రుని మూర్తులే. వారి వారి సంకల్పములు వారి ధనుస్సులుగా నున్నవి. ఆ ధనుస్సులను మేము అల్లెత్రాడు తొలగించి యుంచెదము, అనగా నొకరి సంకల్పము లొకరిని బాధింపకుండునట్లు జీవించెదము. ఈ యుపాసన చేయువాడొక్కడే తన చుట్టును సహస్రయోజనముల వరకునిట్లే రుద్రుల ధనుస్సుల అల్లెత్రాళ్ళను తొలగించి యుంచునుగాక!

మంత్రము : అస్మిన్మహత్యర్ణవేఽన్తరిక్షే భవా అధి।
142 నీలగ్రీవా శ్శితికంఠాశ్శర్వా అధః క్షమాచరాః॥

తా॥ ఈ గొప్ప మహాసముద్రము అంతరిక్షమునందు నధిష్ఠించి ఏయే రుద్రులు కలరో వారి ధనుస్సుల అల్లెత్రాళ్ళను తొలగించి యుంచెదము. నల్లని కంఠములు గలవారు, తెల్లని కంఠములు గలవారు, భూమి కడుగున చరించువారు అగు ఏయే రుద్రులు గలరో వారి వారి ధనుస్సుల అల్లెత్రాళ్ళను తొలగించి యుంచెదము.

టీక : అస్మిన్=దీనియందు, మహతి = గొప్పదియైన,

అర్ణవే = సముద్రమునందు, అంతరిక్షే = అంతరిక్షమునందు, అధి = అధిష్ఠించి, భవాః = రుద్రులు (ఎవరో కలరు), నీలగ్రీవాః = నల్లని కంఠములు గలవారు, శితికంఠాః = తెల్లని కంఠములు కలవారు, అధః క్షమాచరాః = భూమి కడుగున చరించువారు, శర్వాః = రుద్రులు (ఎవరు కలరో వారి యల్లెత్రాళ్ళను సడలించి యుంచెదము).

విశేషము : మహాసముద్రము నందును, అంతకన్న పెద్ద సముద్రమైన అంతరిక్షమునందును, భూమి అడుగునను పుట్టుచున్న నానాజీవుల రూపులై, నల్లని తెల్లని కంఠములతో నొప్పు రుద్రమూర్తులకు కోపాయుధము ప్రయోగించు నవకాశము లేకుండ మేము ప్రవర్తింతుముగాక ! ఈ మంత్రము నుపాసించి నచో తనపై కోపము గలవారు శాంతింతురు.

మంత్రము : నీలగ్రీవా శ్శితికంఠా దివగ్ం రుద్రాఉపశ్రితాః।
143 యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః॥

తా॥ నల్లని తెల్లని కంఠములతో స్వర్గమునుండి మమ్ము సమీపించు రుద్రమూర్తులకును, వృక్షముల యందును, గడ్డిమొక్కల కుచ్చుల రూపముల యందును విహరించు రుద్రమూర్తులకును గల ధనుస్సుల అల్లెత్రాళ్ళను తొలగించి యుంచెదము.

టీక : నీలగ్రీవాః = నల్లని కంఠములు గలవారు, శితికంఠాః = తెల్లని కంఠములు గలవారు, దివం = స్వర్గమును, ఉపశ్రితాః = సమీపించి యున్నవారు, వృక్షేషు = వృక్షముల యందు, సస్పింజరాః = గడ్డికుచ్చుల రూపమువారు, నీలగ్రీవాః = నల్లని కంఠములవారు, విలోహితాః = మిక్కిలి యెఱ్ఱని దేహముల

వారు, యే=ఎవరు కలరో (వారి అల్లెత్రాళ్ళను సడలింపుదురు గాక !)

విశేషము : దివము అనగా స్వర్గమేకాక పగటివేళయని కూడ అర్థము. పగటివేళ నాశ్రయించిన నీలగ్రీవులు ఆకాశ రూపమువారు, శితికంఠులు సూర్యుని వెలుగు రూపమువారు. వృక్షముల యందుండువారు, ఆకుపచ్చని రూపములవారు, గడ్డి కుచ్చుల యందుండువారు, ఆకాశ కేంద్రమునుండి పది దిక్కులకు వెదజల్లు రూపము గలవారు. రాత్రుల యందు నీలగ్రీవులు చీకటి రూపములవారు, విలోహితులు సంధ్యల యందు మిక్కిలి యెఱ్ఱని రూపములవారు. ఇన్ని రూపముల రుద్రులకును కోపము కలుగకుండునట్లు ప్రవర్తింతుము.

మంత్రము : యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః।
144 యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్॥

తా॥ జీవులయందు ఆధిపత్యము వహించియున్న రుద్రమూర్తులలో పిలకలు లేనివారు, జుట్టుముడులు కలవారు అనేక విధములుగా నున్నారు. మరియు ఆహార పదార్థముల నాశ్రయించుకొని కొందరున్నారు. వీరు తినువారిని, త్రాగువారిని విశేషముగ బాధించుచుందురు. వీరి అల్లెత్రాళ్ళను గూడ సడలించెదము.

టీక : యే=ఎవరు, భూతానాం అధిపతయః=జీవుల కధిపతులో, విశిఖాసః=పిలకలు లేనివారో, కపర్దినః=జుట్టు ముడులు కలవారో, యే=ఎవరు, అన్నేషు=ఆహార పదార్థముల యందు, పాత్రేషు=ఆహార పాత్రలయందు, పిబతః=త్రాగు

చున్న, జనాన్ = జనులను, వివిధ్యన్తి = విశేషముగా బాధించు చున్నారో.

విశేషము : జీవుల కధిపతులు అనగా సూక్ష్మశరీరములు. ఇవి కొండలు, రాళ్ళు మొదలగు వానికి గూడ నుండును. అట్టివి నునుపుతేలి అంచులు లేకుండును. కనుక వారు పిలకలు లేని వారు. చెట్లకు, గడ్డి మొక్కలకు, మనుష్యులకు గల సూక్ష్మ దేహములు గ్రంథులు కలిగి యుండును గనుక జటాబంధములు కలవారు. ఆహారపదార్థములను, పాత్రలను ఆశ్రయించుకొని సూక్ష్మజీవు లుండును. అవి వ్యాధులను కల్గించును. కనుక వారి కోపాయుధమునకు కూడ మేము గురి కాకుందుము గాక యని అర్థము. ఈ మంత్రము నుపాసించుటవలన చరాచర జీవులపై అధికారము కలుగును. వ్యాధులను హరించు శక్తి యబ్బును.

మంత్రము : యే పథాం పథిరక్షయ ఐలబృదాయవ్యుధః ।
145 యే తీర్థాని ప్రచరన్తి సృకావన్తో నిషఙ్గిణః ॥

తా॥ మార్గములను రక్షించు రుద్రమూర్తులు కలరు. ఆహార పదార్థములను పుట్టించి పెంచువారలు కలరు. శత్రువులతో యుద్ధము చేయువారు కలరు. చురకత్తులను ధరించి ఖడ్గములను ధరించి తీర్థప్రదేశములను రక్షించుటకు కాపాడు రుద్రమూర్తులు కలరు. వారి ధనుస్సుల అల్లెత్రాళ్ళనుగూడ సడలించెదము.

టీక : పథాం = మార్గముయొక్క, పథిరక్షయః = మార్గ రక్షకులు, ఐలబృదాః = ఆహారము వర్థిల్ల జేయువారు, యవ్యుధః = శత్రువులతో యుద్ధము చేయువారు, సృకావన్తః = చురకత్తులు కలవారు, నిషఙ్గిణః = పెద్ద ఖడ్గములు కలవారు, తీర్థాని = తీర్థ

ప్రదేశములయందు, ప్రచరన్తి = చరించుచున్నారు, యే = ఎవరుగలరో.

విశేషము : మార్గములను రక్షించువారనగా ద్వారపాలకులు. బాటసారుల రక్షణకై నిలుచు నధికారులు మొదలగువారు, మరియు సదృశ్య చరులగు వేదధర్మ సంప్రదాయ మార్గ రక్షకులు. వీరే ఆచార్యులుగా దిగి వచ్చుచుందురు. శత్రువులతో పోరాడువారు అనగా సైన్యాధిపతులు, సేనలు, రక్షకభటులు. వీరు ఖడ్గములను చురకత్తులను ధరించి తిరుగుచుందురు. వీరు రక్షించునది ప్రజాధర్మము గనుక అడియే తీర్థము లేక తరుణోపాయము.

మంత్రము : య ఏతావన్తశ్చ భూయాగ్ం సశ్చ దిశో
146 రుద్రావితస్థిరే। తేషాగ్ం సహస్రయోజనే
ఽవధన్వాని తన్మసి ॥

తా॥ ఈ చెప్పబడిన వారును, ఇంతకన్న అధికులు, చెప్పబడిన సంఖ్యలకన్న అధిక సంఖ్యలు గలవారు, అన్ని దిక్కులయందు అధికారము దాల్చియున్నవారు అగు రుద్రులెవ్వరెవ్వరు గలరో వారి వారి అల్లెత్రాళ్ళను విడదీసి ఒక్కొక్కని చుట్టును వేయి యోజనముల వరకు శాంతి కలుగునట్లు ప్రవర్తించెదము.

టీక : యే = ఎవరు, ఏతావన్తః + చ = ఈ చెప్పబడిన వారును, చెప్పబడినంతయు మరియు, భూయాగ్ం సః + చ = మిగిలినవారును ఇంతకన్న అధికులును, అధిక సంఖ్యగల వారును మరియు, దిశః = దిక్కులలో, వితస్థిరే = విశేషించి

యున్నారో, తేషాం = వారియొక్క, ధన్వాని = ధనుస్సులను, సహస్రయోజనే = వేయి ఆమడల వరకు, అవతన్వసి = అల్లె త్రాళ్ళను సడలించెదము.

విశేషము : ఇందు దిక్పతులు, ఇంద్రాదిదేవతలు, ముప్పది మూడు దేవగణములు, ఇరువది నాలుగు తత్త్వములు, ప్రజాపతి, ప్రణవము, బ్రహ్మాండ గోళము, దాని కధిపతులు నుద్దేశింపబడిరి.

మంత్రము : నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽన్తరిక్షే
147 యే దివి యేషా మన్నంవాతో వర్షమిషవః।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశప్రతీచీర్
దశోదీచీ ర్దశోర్ధ్వా స్తేభ్యో నమస్తే।
నో మృడయంతు తేయం ద్విష్మో
యశ్చనో ద్వేష్టి తం వో జమ్భే దధామి ॥

తా॥ ఈ భూమి యందును, అంతరిక్షము నందును, దివము నందును రుద్రమూర్తు లెవ్వరెవ్వరు కలరో, ఎవరికి అన్నము, గాలి, వర్షము, ఆయుధములో అట్టి రుద్రరూపములకు నమస్కారము. నా యీ పదివేళ్ళతో తూర్పునకు, దక్షిణమునకు, పశ్చిమమునకు, ఉత్తరమునకు, ఊర్ధ్వమునకు, పదిపది నమస్కారములు. ఆ రుద్రులు మమ్ము సుఖింప జేయుదురు గాక ! ఈ జ్ఞానముతో జీవించు మేమెవ్వరిని ద్వేషింపవలసి వచ్చునో, ఎవడు మమ్ము ద్వేషించునో అట్టి వానిని తెరచియున్న రుద్రుని నోటియందు సమర్పించు చున్నాను.

టీక : యే = ఎవరు, పృథివ్యాం = పృథివియందు, అంత రిక్షే = అంతరిక్షమునందు, దివి = స్వర్గమునందు (కలరో), రుద్రేభ్యః నమః = అట్టి రుద్రులకు నమస్కారము, ఏషామన్నం వాతో వర్షమ్ = ఎవరికి అన్నము, గాలి, వర్షము, ఇషవః = ఆయుధములో, తేభ్యః = వారికి నమస్కారము, ప్రాచీః = తూర్పున, దశ = పది, దక్షిణా = దక్షిణమున, దశ = పది, ప్రతీచిః = పశ్చిమమున, దశ = పది, ఉదీచీః = ఉత్తరమున, దశ = పది, ఊర్ధ్వాః = ఊర్ధ్వమున, దశ = పది, నమః = నమస్కారములు, తే = వారు, నః = మమ్ములను, మృడయంతు = సుఖింప జేయుదురు గాక!, యం = ఎవనిని, ద్విష్మః = ద్వేషింతుమో, యః + చ = మరియు నెవడు, నః ద్వేష్టి = మమ్ములను ద్వేషించునో, తం = వానిని, వః = నీయొక్క, జంభే = తెరచి యున్న నోటియందు, దధామి = ఉంచుచున్నాను.

విశేషము : దివము, పృథివి, అంతరిక్షములందు దేవ గణములుగా రుద్రులున్నారు, వారు వేరుగా నాయుధములు ధరింపరు. అన్నము, గాలి, వర్షము వారి ఆయుధములు. అనగా అనాచారము చేయువారికి ఆహారమువలన అజీర్ణాది వ్యాధులును, గాలివలన సూక్ష్మజీవుల వ్యాధులును, వానవలన ఉబ్బసము మొదలగు వ్యాధులును కలుగుచున్నవి. వానినే ఆయుధములుగా ధరించి ఈ రుద్రులు అపరాధులను శిక్షించు చున్నారు. అట్టి రుద్రుల యనుగ్రహము కొరకై నమస్కరించుట యనగా అనాచారాదులు చేయక వేద ధర్మము నవలంబించుట. అట్లు జీవించుచున్నను కొందరు తమకు కోపము కలుగునట్లు ప్రవర్తింపవచ్చును. మరికొందరు తమ్ము ద్వేషింపవచ్చును. వారందరిని రుద్రమూర్తి యొక్క తెరచిన నోటి

యందు సమర్పణ చేయుట యనగా రుద్రార్పణముగా నిర్లి ప్తుడై యుండుట. దానితో మారగలవారు మారుదురు, లేనివారు రుద్రునిలో కలసిపోవుదురు. ఈ మంత్రమును అనుష్ఠించుట వలన శత్రుభీతి తొలగిపోవును.

మంత్రము : త్ర్యంబకం యజామహేసుగంధిం పుష్టివర్ధనమ్।
148 ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ
మాఽమృతాత్ ॥

తా॥ పుష్టిని వృద్ధి చేయునట్టి, మంచి సువాసన కలుగ జేయునట్టి మూర్తియగు త్రినేత్రుని, మేము ఆరాధించుచున్నాము. వాడు పండిన దోసపండును తొడిమనుండి వేరు చేసినట్లు మమ్ము మృత్యువునుండి వేరుచేసి అమృతత్వమునకు చేర్చును గాక!

టీక : త్ర్యంబకం = మూడు కన్నులవానిని, సుగంధిం = మంచి సువాసన కలవానిని, పుష్టివర్ధనం = పుష్టిని పెంచువానిని, యజామహే = ఆరాధించుచున్నాము, ఉర్వారుకం = దోస పండును, బంధనాత్ + ఇవ = తొడిమనుండివలె, మృత్యోః = మృత్యువునుండి, మా = నన్ను, అమృతాత్ = అమృతము వరకు, ముక్షీయ = విమోచనము కలుగజేయును గాక!

విశేషము : మూడు కన్నులవాడు అనగా కొబ్బరికాయ రూపమున నున్న రుద్రుడు. సుగంధి యనగా ఆ పేరుగల ఓషధి (సుగంధపాల Sarsaparilla) . పుష్టివర్ధనం అనగా క్షీరము. రుద్రుని ఆరాధించువారు ఈ ద్రవ్యములను, దోస పండును వ్రతాహారముగా స్వీకరింపవలెను. దీనితో రోగాదులు

తొలగి అకాల మృత్యువు దూరమగును. అమృతత్వ మనబడు ఆనందము సిద్ధించును.

మంత్రము : యోరుద్రో అగ్నౌ యో అప్సుయ ఓషధీషు ।
149 యోరుద్రో విశ్వాభువనా వివేశ తస్మై రుద్రాయ
నమో అస్తు ॥

తా॥ అగ్నియందు, జలములందు, ఓషధుల యందు, సర్వ లోకముల సృష్టియందు ప్రవేశించి అంతర్యామిగా నున్న రుద్రునకు మా నమస్కారము.

టీక : యః రుద్రః = ఏ రుద్రుడు, అగ్నౌ = అగ్ని యందు, అప్సు = జలములందు, ఓషధీషు = ఓషధులయందు, విశ్వా భువనా = సర్వలోకములయందు, వివేశ = ప్రవేశించి యున్నాడో, తస్మై = అతని కొరకు, రుద్రాయ = రుద్రుని కొరకు, నమః + అస్తు = నమస్కార మగుగాక !

విశేషము : అగ్నియందు అనగా సూర్యుని రూపమున, నిప్పు రూపమున, జీవులలో వేడిమి రూపమున ఉన్నవాని యందు, జలములు అనగా నదుల రూపమున, మేఘముల రూపమున, చెరువులు మున్నగు వాని రూపమున, ఓషధులనగా పంటకు వచ్చినంతనే చనిపోవు మొక్కలు - అనగా ధాన్యాదులు, దుంపలు, అరటి మొదలగునవి ("ఓషధ్యః ఫలపాకాన్తః" అని నిర్వచనము).

—: ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః :—



## కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

నవయుగమున నరజాతికి సన్మార్గమును, సేవా కార్య క్రమముల రూపమున క్రమశిక్షణమును మాస్టర్ E. K బోధించిరి. నిస్వార్థబుద్ధితో, విశ్వప్రేమతో నడచి, కొన్ని వేలమందిని నడిపించిరి. ఆత్మజ్ఞానమును ప్రసాదించి అనుయాయులను కార్యోన్ముఖులుగా తయారుచేసిరి. మానవజాతి కళ్యాణార్థమై వేద విద్య, యోగ విద్యలతోపాటు వైద్యవిద్యను కూడ పంచిపెట్టిరి. మానవధర్మమును ప్రబోధించిరి. మాస్టర్ హోమియో వైద్యాలయములను నెలకొల్పిరి. దేశ విదేశములలో వైద్యసేవను ఉచితముగా చేసి, శారీరక, మానసిక ఆరోగ్యములను కొన్ని వేలమందికి ప్రసాదించిరి. అనేక ప్రాంతములు పర్యటించి ఆధ్యాత్మిక తత్త్వశాస్త్రములతోపాటు, హోమియో తత్త్వసారమును జిజ్ఞాసువులకు ఉపదేశించిరి. ప్రాక్-పశ్చిమ ఆధ్యాత్మిక సమన్వయమును సాధించుటకై "ది వరల్డ్ టీచర్ ట్రస్ట్" (జగద్గురు పీఠము) ను 1971లో స్థాపించిరి. ఏడు పర్యాయములు పశ్చిమ ఖండములలో ఆధ్యాత్మిక ఉద్దీపన యాత్ర జేసిరి. మాస్టర్ E. K. 1926వ సం॥ ఆగస్టు 11వ తేదీన భౌతిక దేహమును ధరించి, 1984వ సం॥ మార్చి 17వ తేదీన దేహమును చాలించిరి.